# సుయోధనుఁడు



గ్రంథకర్త:

ఈ. శ్రీనివాసవరదాచార్యులు

ది మోడరన్ పబ్లిషర్సు (రిజిష్టర్డు)

తెనాలి : : బెజవాడ

1947



[వెల రు. 1-8-0

# విషయ సూచిక


| | | పుట. |
|---|---|---|
| 1. | వ్యాసాగమనము | 1 |
| 2. | కుమార సంభవము | 5 |
| 3. | బాల్యక్రీడ | 9 |
| 4. | దురాలోచన | 13 |
| 5. | విద్యాపరీక్షణము | 19 |
| 6. | అస్త్రవిద్యాసందర్శనము | 23 |
| 7. | కుయుక్తి | 32 |
| 8. | గదావిద్యాభ్యాసము | 39 |
| 9. | అర్ధరాజ్యదానము | 42 |
| 10. | సభానిర్మాణము | 48 |
| 11. | రథికులు | 52 |
| 12. | జూదము | 55 |
| 13. | ఓడార్పు | 59 |
| 14. | అరణ్యాగమనము | 62 |
| 15. | రహస్యాలోచన | 65 |
| 16. | ఘోషయాత్ర | 71 |
| 17. | వేట | 74 |
| 18. | మానభంగము | 77 |
| 19. | ఆపన్నసంరక్షణము | 83 |

| | | పుట. |
|---|---|---|
| 20. | ప్రాయోపవేశము | 90 |
| 21. | అసురోపదేశము | 93 |
| 22. | సైన్యనిర్యాణము | 96 |
| 23. | మాత్స్యపుర ప్రయాణము | 99 |
| 24. | గోగ్రహణము | 102 |
| 25. | సాయము కుదిర్పుకోలు | 111 |
| 26 | మిత్రభేదము | 116 |
| 27. | శ్రీకృష్ణ రాయబారము | 121 |
| 28 | మంత్రాలోచన | 128 |
| 29. | సేనాపతినిర్ణయము | 132 |
| 30 | ద్వంద్వయుద్ధము | 133 |
| 31. | సైంధవవధ | 138 |
| 32. | సంకులసమరము | 145 |
| 33. | గదాయుద్ధము | 148 |
| 34 | ఉపసంహారము | 158 |

# సుయోధనుఁడు

## వ్యాసాగమనము

ఆహా! కుటిలమతియై యీపిడ యెట్టి యకార్యమాచరించెను! ఇంతకాలము వేచియుండినది ఇంకఁ గొన్ని నాళ్ళోపిక పట్టియుండిన బాగుండెడిది కదా! పెద్దవాఁడనుగదా యని నామాటపై విశ్వాసముంచి యుండినఁ జాలమేలు గలిగి యుండును. తొందరపడి యింతలోనఁ దనముల్లె యేమి మాసిఁగె నని యిట్లొనర్చెను? ఆఱునెలల కాఱుతూములు పండుచేను మూఁడు నెలలకు మూఁడు తూములు పండకుండునే, యని కోఁత పట్టినఁ బ్రయోజనమేమి? ఈమాత్ర మెఱుఁగక యిట్టి యకార్యము సేయుట దీని తెలివి లేమిని బ్రకటించుచున్నది. పుత్త్రముఖ దర్శనమున నుత్కంఠ యుదయించిన నడయించనిమ్మ. బావినీరు వెల్లువకుఁ బోవునే? విదియనాఁడు గాన్పింపక పోయినను జంద్రుఁడు తదియనాఁడు గానుపింపక పోవునే? తొందరపాటు పెల్లకార్యములకును భంగకరమనుట యెఱుఁగక యిట్లాచరించెను. ఓరిమియుండిన నొక్కటికి నూఱింతలు ఫలము గలుగును. అవిమృశ్యకారిత యన్నివిధములఁ జెఱుపుకు మూలము.

ఒక్క యవసరపాటే యీకార్యమునకుఁ గారణము కాదు. అగ్నికి వాయువు దోడగులాగున అసూయయు దీనికిఁ గారణమగుచున్నది. తోడుకోడలికి సంతానము గలిగిన దీని కేమికొదువ గలిగెను? ఈదినము దానికిఁ గలిగిన రేపు

తనకుఁ గలుగకుండునా ? ఈర్ష్యాగ్రస్త యగుటచే గర్భమునఁ గల పిండము బైటఁబడక యట్టె నిలువ దనుట తెలియ దాయెను.

హా ! పరోత్కర్షా సహిష్ణుత ఎంతకుఁ దెచ్చెను ! ఇది దీని మేలుకుఁ గాసేరము తొందరపాటునఁగదా వినతకు దాస్యమబ్బెను ? అత్యుత్కటములగు పుణ్యపాపముల ఫలమిచ్చుటన యనుభవింప వలయును. కావని తొలఁగ ద్రోసినచో అది తనఫలము నీకుండునా ? తెలియక కాఁకిన నిప్పు కాల్పకుండునా ? ఎప్పటి సంగతియో తడవ నేల ? ప్రస్తుత మీ మాంసకోశము పయోగ శూన్య మగునదేకదా ! అట్లని యూరకుండుట భావ్యము కాదు. దీని నెట్లైన సరిపఱచియ తీఱవలయును.

అని యిట్లాలోచించుచు హస్తినాపుర రాజాంతఃపురములోని కొక యోగి ప్రవేశించుచుండెను. అతని కపిల గడ్డమును కపిల జడలును గపిల నేత్రములును అతని మోమున కొక వింతసోయగ మొసఁగుచుండెను.

యోగి యంతిపురిలోనఁ జొచ్చినంతన యావత్తు చెలుల మూలమున వినిన యొకవనిత తన చెలులు చేయిఁబట్టి దారిచూపఁగ ఆప్రదేశమునకు వచ్చెను. ఆవిడ యేలోకో నేత్రపట్టము గట్టుకొని యుండెను. వచ్చిన యామె యాయోగికి నమస్కరించెను. అతఁ డామెకు దీవెన లొసఁగి;

"అమ్మాయీ! అన్యాయము యెట్టివారికైనను దగదనుట తెలియక యెట్టి క్రూరకార్యము చేసితివి? గర్భపాత మెంతటి

పాపవహ మగునదో తెలియునా? దీనc గలుగcబోవు కీడు నీ వెఱుcగి యుండిన యిట్లొనర్చియుండc జాలవు. జరిగిన దానికి వగచిన ఫలమేమి?"

"స్వామీ! నా కోడికోడలికి సంతానము గలిగెనని విని నే సోదరతాడనము గావించుకొనిన మాట వాస్తవము. దుఃఖాకులయగుట చే గర్భపాత మగుననుట యెఱుcగక యిట్టి యకార్య మాచరించితిని. ఇట్లు మాంసకోశము బైలువడునని నే నూహింపనైతిని. అజ్ఞానమున నాచరించిన యీ యకార్యమును క్షమించి నన్నుc గాపాడ వలయును. ఎట్లైనను దీనిని సజీవము గావింప వేడెదను. దేవరవారు దలcచినc గానిపని యొకటి గలదే?"

"తాముచేసిన కర్మను తామనుభవించియె తీఱవలయును. కాబట్టి నీకిట్టి తలంపు గల్గెను. 'బుద్ధిః కర్మానుసారిణీ' యనికదా పెద్దలు వచించెదరు?"

"అఘటితఘటనా సమర్థులగు దేవరవారు తలcచినచో ఇది యొంతపాటిది?"

నా సామర్థ్యము విధివిధానమును మార్చcగలదా!"

"స్వామీ! నేనాచరించినది తప్పె యగును. బాలిశురాలనగుటచే నేనొనర్చిన యపరాధమును బెద్దవారలగు మీరుగూడ [illegible]. ఉదారబుద్ధు లిట్టివి గణనసేయరు గదా! నా[illegible] పిరికితనమున దేవరవారికి [illegible] లేదా? కాబట్టి యెట్లైనను మీ రీకార్యము నెరవేర్పవల

యును. వ్యాసమహర్షి యనుగ్రహమునఁ గౌరవవంశ మభివృద్ధమయ్యె నను ఖ్యాతి మీమీఁదఁగదా స్థిరపడియున్నది."

"బాలా! నీవాడిన పలాగున నది నాకును వ్యథనిచ్చునదే యైనను నేనిందుల కేమిచేయఁగలను? ఈశ్వరేచ్ఛ యెట్లుండ నది జరుగక మానునా? ప్రస్తుత మీ మాంసకోశమును నేకోత్తరశత ఖండములు గావించెదను. వాని వేఱువేఱుగా నేతికుండల వేయుంపుము. అప్పుడప్పుడు చన్నీటఁ దడిపించుచుండునది. ఇట్లొనర్చుటచే నూర్గురు కొడుకులును ఒక్క కూఁతురును బుట్టుదురు."

"ఆహా! సంతానోత్పత్తిని గుఱించిన చింత మానెను. కాని—"

అనిపలికి యావనిత పైఁబలుకుట కించుక సంశయించుచుండెను. వ్యాసుఁడు, నాబిడ భావమును గ్రహించి;

"గాంధారీ! నీయగ్రసుతుఁడు జననమాదిగ సకల సౌఖ్యముల ననుభవింపఁగలఁడు. రాజరాజ బిరుదాంకితుఁడు కాఁగలడు. భూమండలమెల్లను ఏకచ్ఛత్రాధిపతియై యేలఁబోయెడివాఁడు అతని సోదరులును మిక్కిలి యనుకూలురై యుండఁబోదురు. ఇట్లు నీ సంతతి యంతయును అత్యంత విభవముతో నుండఁగలరు. ఇంతటితో సంతోషింపుము. ఇంక నద్దియు నడుగఁగోరకుము. తపోవృత్తి నుండువారము మేమిటఁ దడయుట యుక్తము కాదు."

అని యామాంసకోశమును నూటయొక్క ఖండములు గావించెను, 'వాని జాగరూకతతోఁ గాపాడుచుండవలయు' నని యాజ్ఞాపించెను. ఆవల గాంధారిని వీడ్కొని వ్యాస మహామునీంద్రుఁడు తపోవనమున కరిగెను. గాంధారి తనయుల యాయుర్దాయమును గుఱించి మహర్షి తెలుపకుండినందుల కించుక చింతించెను. ఏకచ్ఛత్రాధిపతి యగునని వ్యాసుఁ డనుగ్రహించి యుండుటచేఁ జిరకాలము జీవించియుండఁ గలఁడని భావించి సంతసించెను అతని యానతిచొప్పున ఆఖండముల నేతికుండలలో నైచి యతి జాగరూకతతోఁ గాపాడుచు వానినుండి బిడ్డలుగలుగు సమయమును నిరీక్షించుచుండెను.

# కుమార సంభవము

వ్యాసమహర్షి యరిగిన కొన్నిదినముల కావల ఆ మాంసఖండములలో ఒక్కదానినుండి పుత్త్రుఁడొకఁ డుదయించెను వాఁడు సర్వాంగ సుందరుఁడై యుండెను. వాని జననకాలమున ఆకసమునుండి నక్షత్రములు రాలెను. సూర్యుని కాంతి తగ్గెను. నక్కలు కూయుట కారంభించెను. భూమి యదురఁ దొడఁగెను. ఇట్టియుత్పాతములు గాంచి గాంధారీ ధృతరాష్ట్రులు చింతించుచుండిరి. అప్పుడు విదురుఁడు వారి చెంతకువచ్చి ;

విదుర:—అన్నా! నన్ను మన్నించి నామాట వినుము. వ్యాసానుగ్రహమున నూటయొక్కండ్రు గలుగఁ బోయెడి వారలుకదా! వారిలో నొక్కండుండినను లేకున్నను శోచనీయము కాదు. ఇప్పు డుదయించిన యుత్పాతముల మూలమునఁ గురువంశమున కెల్లను ఎద్దియోయిక్కట్టు గలుగఁ బోయెడి నని తోఁచుచున్నది. 'త్యజేదేకం కులస్యార్థే' యనుట మీ రెఱుఁగని యంశము కాదు. అంగవ్రాతములలో ఒక్కదానఁ దుర్వ్యాధి యుదయించినఁ జికిత్సకుఁడు దానిని ఛేదించి శేషించిన యంగములఁ గాపాడుచుండుట లేదా?

ఇదివిని గాంధారీధృతరాష్ట్రు లత్యంత విషాదాకులులైరి. కన్నకుమారునిపైఁ గనికరము మాని కాలుని పాలి కనుపుటకు వారికి మన సొప్పకుండెను. వీనివలనఁ గురువంశమున కంతయును ఎచ్చట హానికలుగునో యను భీతి యొకవైపున బాధించుచుండెను. ఏమి చేయుటకును దోఁచక వారు చింతించుచుండునపుడు శకుని యచటికి వచ్చెను. విదురుఁడు వచియించిన దంతయు వారిమూలమునఁ దెలిసికొనెను. అంత ధృతరాష్ట్రుని ఇంచుక యావలికిఁ బిలిచికొని వెడలి;

శకుని:—బావా! విదురుఁ డాదినుండియుఁ బాండుపక్ష మవలంబించి యుండువాఁడు. నీతనయుఁడు రాజరాజ బిరుదముతో నేకచ్ఛత్రాధిపతియై భూమండలము నేలినఁ బాండురాజతనయులకు ఎచ్చట రాజ్యము లేకపోవునో యని యెంచి యిట్లాడుచున్నాఁడు. నైసర్గికము లగువానికి నుత్పాతములని పేరుపెట్టి, ఎట్టిసంబంధము లేని నీకుమారుని

జననమునకును వానికిని ముడిపెట్టుచున్నాఁడు. వీఁడును నీవలె వ్యాసానుగ్రహమున జనించిన వాఁడగుటచే జ్ఞాతివైరమును నీయెడఁ జూపుచున్నాఁడు.

ధృతరాష్ట్రి:-నీ వాకునదంత యుచితము కాదు. నక్షత్రపతనాదికము నైసర్గికమే కానిమ్ము. శాస్త్రపద్ధతి నది యుత్పాతమే యగును. వీని జనన కాలముననే యీ యుత్పాతములు గలుగుట లేదిదియో విశేషముండునని యెంచెదను. కులనాశకుఁడుగా నుండుటఁబట్టియే విదురుఁడిట్లాడియుండ నోపును. ఇతఁడు న్యాయశీలుఁడు. ఇతని మాటలు దప్పక విశ్వసింపఁ దగినవి. కౌరవజ్యేష్ఠుఁడిప్పుడు పాండుసుతుఁడ యగును. అట్టియెడ రాజ్యపాలనమున కాతఁడ యర్హుఁడగును. అట్లుండ వానికెచ్చట రాజ్యము రాకతక్కునో యనుచింత యాతనికిఁ గల్గ నవసరము లేదు గదా! అట్టియెడఁ బాండుపక్షపాతియై ముసివేయు చున్నాఁడనియు, జ్ఞాతివైరము చూపుచున్నాఁడనియు నీవాతనిపై నిందమోపుట సరికాదు.

శకుని:-బావా! నీ యీమాటలు నాకించుకయు రుచించుట లేదు. తన్నుమాలిన ధర్మమును మొదలు చెడిన బేరమును గలదా?

ధృతరాష్ట్రి:-అన్యులసొమ్ము కాసపడిన లాభమేమి? జ్యేష్ఠుఁడగు పాండుసుతునకుఁ జేరవలసిన రాజ్యము మన మపేక్షించుట యన్యాయము. లాతు లిడివిసిన మనల దూఱుదురు.

శకుని:- జ్యేష్ఠునకే రాజ్యాధికార ముండినయెడల మొన్నటివఱకుఁ బాండురాజు రాజ్యమేలుట యెట్లుసంభవము!

ధృతరాష్ట్రః- నే నంధుఁడనగుటచే రాజ్యపాలనమున కశక్తుఁడ నైతిని. కాఁబట్టి నాకు మాఱుగ నాతమ్ముఁడు రాజ్యమేలు చుండెడివాఁడు.

శకుని:- రాజ్యము మీఁదగునపుడు మీవంశమునకే పరిపాలనాధికారము గలదు. వ్యాసానుగ్రహమున నీకింక నుగుమారులు జనించెదరు. కాఁబట్టి వారిలోన నీతఁడే జ్యేష్ఠుఁడు. కావున నీతఁడే రాజ్యమును బరిపాలింప నర్హుఁడు. ఇప్పుడెవరి మాటలు న్యాయబద్ధములో యాలోచించితివా! ఇంక నైన నాదారికిరమ్మా.

ధృతరాష్ట్రః- నీవెంత చెప్పినను నామదికది నచ్చుట లేదు. ఇంతకును ఇప్పుడా చింతయేల? అప్పటిమాట చూచు కొందము.

ఈ మాట లాలకించిన శకునియు రాజుంచుక దారి బడినటుల భావించి సంతసించెను. అంత వారటనుండి కదలి చనిరి.

# బాలక్రీడ

"అన్నా! ఇన్ని దినములు మనమెన్నియో యాటలాడి యుంటిమి కాని యన్నిటికంటె మిన్నయగు నొక్క యాట యందు నాకభిలాష యుదయించెను. దానిఁ దెల్పవలయు ననిన నీవేమందువో యని యించుక సంకోచించుచున్నాను."

"భీమసేనా! నీకోరిన యాటయెట్టిదియో తెలుపుము. నేనందుల కడ్డము సెప్పఁబోయెడి వాఁడను గాను."

"అన్నా! నీ వెప్పుడును మాకుఁ బ్రియము సేయు వాఁడ వనుట నాకుఁ దెలియదా! నావలుకులు వినిన దర్పోద్ధతుఁడని యందువేమో యనియెంచి యట్లంటిని."

"క్షత్రియుఁ డెప్పుడును దర్పోద్ధతుఁడై యుండవలయును. అది కొనియాడఁ దగినదే కాని నిందార్హమెట్లగును? ఇంక నీ వాడఁగింప నెంచినదానినిఁ వివరింపుము."

"ఈ యాటయందు మీరు మహారాజులు గావలయును. ఇదె కాన్పించు నీ యశోకవృక్షపు టడుగు భాగము మీకు సింహాసన మగును. నేనును పార్థుఁడును మంత్రుల మయ్యెదము. నకుల సహదేవులు మీకంగ రక్షకులగుదురు. దుర్యోధనుఁడు ద్వారపాలకుఁడు గావలయును. దుశ్శాసనాదులు సేవకులు గావలయును."

అభిమానధనులగు నా సుయోధనాదు లిదివిని యాగ్రహోదగ్రులైరి. అంత దుశ్శాసనుఁడు;

"పవనతనయా! మహారాజ కుమారుఁడగు మా యన్న రాజు కావలయును. మేము మంత్రులు గావలయును. అబ్బ చావఁగ గతిలేక తల్లితోడ మాయింటికి వచ్చి మాయన్నము దిని బ్రతికెడివారు మీరు రాజును మంత్రులు నగుటెట్లు? ఆటయే కదా యని మే మీనాఁడిన నూరకుండిన రేపు వాస్తవముగ నట్లే కాఁగలరు. కాఁబట్టి మే మీ మాట కోడఁబడఁజాలము. నీ వెల్లప్పుడును మాకుఁ గష్టములే కలిగించుచుందువు. నీప్రవర్తన మించుకయు బాగుండుట లేదు తిన్నయింటి వాసములు లెక్కిడు వానిఁబోలె మాయన్నముదిని మాకే యపకారము సేయుచుందువు. నీ చేఁతలు మా కెంత యాగ్రహము గలిగించుచుండినను బాపముగలితులు గదా యని యొంచి యూరకున్నవారము. మే మట్లు మిన్నకుండు కొలఁదిఁ మీఱుచున్నవాఁడవు. ఇంక నిట్లాచరించిన మా క్రోధమునకుఁ బాత్రుఁడ వగుదువు. 'ఇనుమునుఁగూడి యగ్గికి సమ్మెటపెట్లన్న' లాగున నీతోఁగూడి నీసోదరులును జెడఁగలరు. తుదకు మీ బ్రతుకుకే హాని రాఁగలదు.

"తమ్ముఁడా! వారితో నేల మాటలు పెంచుకొనెదవు? పట్టాభిషేకార్హుఁడను నేను కాఁబట్టి యందులకై యిప్పుడు పెనఁగులాడవలసిన యవసరము గాన్పింపదు. వాని యన్న ఆటనెపముననైన రాజుగానుండ నిమ్మనుట అతని ఆశయము. దానినేల నీవు నిరోధించెదవు? ఈవిహారముచే నైనను వానికిఁ గొంచెము మనస్సంతుష్టి గలుగనిమ్ము."

"ఓహో! దుర్యోధన మహారాజులు పట్టాభిషిక్తులు కాఁగలరు కాఁబోలు? వారికిదె నేఁ గిరీట మిడుచున్నాఁడను."

అని భీమసేనుఁడు దనపిడికిట సుయోధనుని శిరమున మోదెను. బలహీనుఁడయ్యును అతఁ డించుక చలించెను. అంతలోఁ దెప్పిరిలి భీముని పైఁబడ నుంకించెను. ధర్మరాజు వీరిరువురి మధ్యమునకుఁ బ్రవేశించి;

"భీమసేనా! నీయీ యాచరణము సరికాదు సుయోధనుఁ డాడినలాగున రాజ్యార్హుఁ డతఁడగును. మనమగతికులమై వారిని శరణుసొచ్చియుంట యథార్థము. అట్లుండఁగా అన్నదాతలపైనా యాగ్రహముపూని యుద్ధము లాచరించుట! ఇది యయుక్తము—సుయోధనా! భీమసేనుఁ డాదినుండియును ఆలోచనా శూన్యుఁడునై, కోపశీలుఁడు నగును. అట్టివానితో నీ కేల వాదులాట? పెద్దవాఁడను నేనట నుండ వానిమాట గణనచేసి బదులేల పల్కెదవు? నేను నా సోదరుల కంటె నిను మిక్కుటముగఁ బ్రేమించుచున్నాను. కాఁబట్టి నామాటలమన్నన గౌరవముంచి యాగ్రహము నుపసంహరించుకొనుము.

"అన్నా! నీవేల యీతుచ్ఛు నింతగొప్పచేసి వేఁడికొనెదవు? నీచుని గొప్పచేయుకొలఁది వాని గర్వ మతిశయించుచుండును. రాజ్యమెప్పుడును వీరభోజ్యమగును. నా యీస్వల్పపు దెబ్బకే యోఁగలేక గడగడ వణఁకెడివాఁడు రాజ్యపరిపాలనార్హుఁ డెట్లగును? ఇట్టి శౌర్యవిహీనుఁ డధిపతి

నైనఁ బ్రజలు మెత్తురే? ప్రజాను రంజకుఁడు కానినాఁడు వాని రాజనామము నిజ సమాఖ్య మేమగును. కలవడిన లాగున నిరర్థకమే కదా?”

“సోదరా! నీ కాతని శౌర్యము తెలియదు. పరాక్రమమున నీతో సమానుఁడని భావింపుము. నీవలె నుద్ధతుఁడు గాక గంభీర స్వభావుఁ డగుటచే నీ కాతని బలము తెలియకున్నది. ప్రసక్త మునవుకదా యది యెఱుఁగనగునా? సోదరులారా! ప్రొద్దుగుంకఁ బోవుచున్నది. నేఁటి కింక ఏవిహారమును వలదు. తిన్నఁగ గృహముల కరుగుదము రండు.”

అని ధర్మరాజు రాజపుత్రులెల్లరఁ బిలుచుకొని నిజ గృహమునకుఁ జనెను. దుర్యోధనుఁడు మాత్రము భీముని యాహతిచేతను అంతకంటె వేయిమడుఁగు లధికమగు నాతని వాక్శరముల నిహతిచేతను మిక్కిలి కుపితుఁడయ్యెను ధర్మజుని వాక్యములఁ గట్టుపడి మంత్రరుద్ధమగు సర్పము లాగున లోలోనఁ దపించుచు నతని వెంట నరిగెను.

# దురాలోచన

ఒక్క-నాఁటి యుదయమున శకుని దుశ్శాసనాదు లొక్కెడ నేకాంతగృహము సేరిరి. సుయోధనుని మోము వాఁడుబాఱి యుండెను. అప్పుడు శకుని యాతని చెంతఁజేరి;

శకుని:—రాజకుమారా! నీమోమేల వాడియున్నది? నీకింతటి దుఃఖముదయించుటకుఁ గారణమేమి?

సుయోధన:—మామా! వృకోదరుఁడు మాకుఁ గల్గించు బాధలు నీకుఁ దెలియవా? అవిగాక నావ్యధకింక వేఱు కారణము గావలయునా? వాని నేమిసేయుటకును వీలుగాని లాగున ధర్మపుత్రుఁ డడ్డపడుచున్నాఁడు. నే నాతనిమాటల నిరాకరింపలేక యూరకుండవలసి వచ్చుచున్నది.

శకుని:—భీముఁడు మిము బాధపెట్టుచుండుట యిప్పుడు క్రొత్తగాదుకదా? అట్లుండ నిన్ని దినములనుండి కలుగకున్న యీవిషాదము నేఁడుదయింప నేమి కారణము?

సుయోధన:—ధర్మజుని రాజుగావించి తానును బార్థుఁడును మంత్రులగుచుండ మేమెల్లరము వారికి దాసానుదాసులమై వర్తింపవలయునని యాతని యభిప్రాయము. నిన్న సాయంకాల మాటనెపమునఁ దనభావము వెల్లడిపఱచెను. కుఱ్ఱవాఁడు దుశ్శాసనుఁ డాతనితో నావిషయమున వాదులాడఁ దొడఁగెను. నేనద్దాని నాఁపఁబోవ నాశిరమునఁ దనపిడికిట దెబ్బవైచెను. నాకాగ్రహము జనించి వానిపైఁ

బడఁబోవుచుండ ధర్మరా జడ్డుపడి నా ప్రయత్నమును మాన్పెను. ధర్మసుతుని మాటల నిరాకరింపలేక యూరకుంటిని గాని యాగ్రహము తగ్గకున్నది. దాని మూలముననే నాకీయవస్థ సంప్రాప్తమైనది.

శకుని:— అజాతశత్రువు మాటల నీ వేల నరకు నీసెదవు? అతఁడు దనసోదరున కపాయము గలుగకుండుట కై కదా యడ్డమువచ్చుచుండును? అట్టివాని మాటల నాగౌరవింప వలయునా?

సుయోధన:— నీవాడినట్లుగ నతఁ డజాతశత్రుఁడగుటయే నేనాతని మాటల నిరాకరింపలేక లొంగిపోవుటకుఁ గారణమగుచున్నది.

దుశ్శాసన:— అతఁ డంతటి ధర్మశీలుఁడైనఁ దన తమ్మునకు బుద్ధిసెప్పి మనల నెన్నఁడును వాఁడెదిరింపకుండు నట్లుగనఁ జేయరాదా? భీముఁడు మనకపకారములు గావించుచుండ నూరకుండి మన మందరకు బహులు నేయుఁ బూనునప్పుడు కదా యడ్డమువచ్చుచున్నాఁడు! దీనిమూలముననే వానికి పక్షపాతబుద్ధి స్పష్టముగఁ దెలియవచ్చుట లేదా! అట్టివాని మాటలకు మనమేల గౌరవము నీయవలయును? నా కాజ్ఞ యిమ్ము. అటనిజా సమయమున భీముని జంపఁగలను. నీ విట్లింతకాల మూరకుంటివేని వాఁడు సమగ్రముగఁ బడఁజాలఁడు. నిక్కముగ వానిఁ జంపకుండిన రాజ్యము మనకుఁ దక్కదు. భీముఁడు మరణించిన ధర్మజుని నిర్బంధించి మన వశమున నుంచుకొనవచ్చును.

సుయోధనః—సోదరా! బాలుఁడవగుటచేఁ దొందరపడి యాడుచున్నావు. ఒకని హింసించుట యెంతటిదోషమునకు మూలమగుననుట తెలిసియుండిన నీవీలాగున వచింపకుందువు. శత్రువునట్టి మానభంగము గావించి యాతఁడు దేహమును గాఢముగఁ బ్రవర్తింపకుండులాగునఁ జేయుటయే తగవు.

దుశ్శాసనః—జ్ఞాతులయెడఁ బ్రీతినుంచుట నీతిగాదు. 'జ్ఞాతిశ్చేదనలేనకి' మ్మనుట నీవెఱుఁగవా! మున్నెందఱు జ్ఞాతివైరము కారణముగా సోదరుల వీడి పరులఁ జేర లేదు.

వికర్ణః—అన్నా! నీవాడునది యుక్తము కాదు. సోదరుఁడైనను జనకుఁడైనను దుష్టుఁడైన వాని వీడుట ధర్మము. సద్గుణుఁడు శత్రుపక్షమువాఁడైనను వాని సాంగత్య మవశ్యాపేక్ష్యము.

శకునిః—అబ్బాయీ! లోకానుభవ శూన్యుఁడవగుటచే నీవీలాగునఁ బలుకుచున్నావు. మొదటినుండి భీముఁడు మనయెడ విరోధమునే పాటించుచున్నాఁడు. మన సొమ్ముఁ దినుచు మనకు భంగము గల్పించుట నీతి విదూరము గదా? అట్టి నీతిబాహ్యునకుఁ దగుదండము విధించుట దైవసమ్మతము.

దుశ్శాసనః—తప్పునకుఁ దగినశిక్ష విధింపవలయుననుట భావ్యము. వాఁ డాచరించిన యకార్యమునకు వానిఁ జంపుటయె సరియగు శిక్ష.

సుయోధనః—ఎప్పుడును ఆలోచింపని పని సేయరాదు.
సి చేసినపని అన్నివిధముల జయము గాంచును.

వింద:—ఇఁకాలోచన యేమియును జేయ నవసర ముండులాగున నాకుఁ దోఁచుటలేదు. మన మొకనిహింసింప నుపక్రమించలేదు. మనల హింసించువానికిఁ బ్రతిక్రియ నొప్ప నెంచితిమి. ఎట్టివానికిని ఆత్మసంరక్షణ మవశ్యకర్తవ్యము. పులి మనపైఁబడ వచ్చుచుండ జంతుహింస పనికిరాదని యూరకుండిన అది మనలఁ జంపదే?

సుబోధన:—ఆత్మరక్షణ మవశ్యకర్తవ్య మను మాట వాస్తవమే, అయినను 'నింద మోయుట కంటె ముండ మోయుట యుత్తమ' మనుట తెలియదా? లోకులు న్యాయాన్యాయముల విమర్శింపక 'వాఁడు క్రూరుఁడు, అకారణముగ నొరుని హింసించెను' అని యాడికొందురు. వారినోటఁ బడకుండుట కుపాయ మేమగునని యాలోచించితివే?

అనువింద:—ఇది యకారణ మెట్లగును? మనలఁ బెక్కురీతుల వాఁడు బాధించుచుండుట కారణము గాదె!

సుబోధన:—బాధకుఁ బ్రతీకారము హింసయా? ఇది యన్యాయము కాదా! అట్లుండ లోకులేల దూషింపకుందురు?

దుశ్శాసన:—భంగపాటు యావజ్జీవ తీవ్రవేదనాకరము. మరణమాపాత యాతనావహము. కాఁబట్టి ఒకనిఁ జంపుట కంటె భంగపెట్టుట యత్యంత దోషావహము. పాపకార్య మాచరించినవానిఁ జంపుట వాఁడు చేసిన యపరాధమునకుఁ జాలినంత శిక్షగా నేరదు. అయినను ఇంతకంటె విధించుటకు వేఱుశిక్ష లేనందున ఈదండనము గావింపవలసి వచ్చుచున్నది.

సుయోధనః:—మామా! నీయిచ్చుచొప్పునఁ గార్యము నిర్విఘ్నముగాఁ గొనసాగు ననియే యెంచుచుము. ఇట్టి వెంత గుప్తముగా నాచరించినను జాల కాలము దాఁగి యుండఁ జాలవు. ఎప్పటి కైన బయలుపడఁ గలవు అప్పుడు 'సుయోధనుఁ డసూయాగ్రస్తుఁడై భీముని జంపించె' నను జనోక్తి స్థిరముగా నిలుచును. నే ఖ్యాతినొందినను నాచరిత్రము నెవ్వ కొను వారు నను నిందింప కుందురా? వేనఁడు ఖ్యాతినొంది యెంత కాల మయ్యెను? జను లిప్పటికిని వాని చరిత్ర మెత్తిన నిందావాక్యము లాడుచున్నారు గదా! రేపు నాచరిత్రమును అట్లే గదా కలుషితము గాఁ గలదు?

శకుని:—అల్లుడా! 'లోకోభిన్నరుచి' యనుట యెఱుఁగవా? దూషించువారు కొందఱుండిన భూషించు వారును కొందఱుందురు. గర్వముచే నకారణముగ నొరుల కిడుములు గల్పించు వారికిని, ఆత్మరక్షణమునకై యపకారిని హింసించు వారికిని భేదము గుణగ్రహణదక్షులగువారు కనిపెట్టఁ జాలక పోవరు. ఇదియు వానిఁ జంపుట లోకోపకారము నగును. ఎట్లన? ఈదినము మనల భంగపఱుప వచ్చు రుచి గన్నవాఁ డగుటచే ఇట్లే అనేకులకు భంగము గలిగింపఁ దొడఁగును. వాని నిప్పుడే నిర్మూలము గావించిన జనులను ఆకష్టమునుండి తొలఁగించిన వార మగుదుము.

ఈమాట లాలకించిన సుయోధనుని భావ మించుక మాఱఁ దొడఁగెను. 'నబోధనాత్పరాశక్తి' యనుట నిక్కము గదా! రాముని నిజసుతుఁ డంటే నెక్కుడుగాఁ జూచుచుండిన

కైకేయి మంథర బోధన మూలమునఁ గదా యడవులపాలు గావించెను! సుయోధనుని యీ యర్థాంగీకారమును ఆధారము గావించుకొని యాతని సోదరులు భీమ సంహారమునకుఁ దఱి వేచియుండిరి.

# విద్యా పరీక్షణము

కౌరవులు భీముని సంహరింపఁ బలువిధములఁ బ్రయత్నించిరి. అలసి నిద్రించుచున్న వానిఁ బంధించి గంగలోఁ ద్రోసిరి. నీటిలోఁ బడుచుండు భీముఁడు మేల్కాంచి ఆ కట్టములఁ ద్రెంచుకొని జలమునుండి వెలుపలికి వచ్చెను. కుంతిసుతుఁడగు నాతని సర్పములచేఁ గఱిపింపఁ బ్రయత్నించిరి గాని ఆసర్పము లాతని గాటుపైవఁ జాలవయ్యెను. అప్పుడు మేలుకొనిన వాయుసుతుఁడు పాములఁ దన కాలఁ జమరిచంపెను. సారథియును వానిని యమపురి కంపెను. విషమిశ్రితాన్నము పెట్టించిరి అదియు జీర్ణమయ్యెను. ఇట్లు పెక్కుమార్గముల భీముని జంపఁ జూచిరి. కాని వీరి ప్రయత్నము లెల్ల వ్యర్థము లైనవి.

భీష్మునకు వీరొనర్చినవి యెల్లఁ దెలియకపోయినను కౌరవ పాండవులకుఁ బరస్పరము విరోధము గలదనిమాత్రము అతఁడు గ్రహింపఁ గలిగెను.

"రాజ్యపాలనమున నైకమత్యము ముఖ్యము. ఇట్లు పరస్పర విరోధములుండిన ఆరాజ్యము బాగుపడఁ జాలదు. ప్రజలకును ఆపాలనమువలన సౌఖ్యముగలుగఁ జాలదు. ఇట్లు వీరి కన్యోన్యద్వేషముగలుగుటకుఁగారణము విద్యావిహీనతయే యగును. విద్య యుంపడిన వివేక మభివృద్ధియగును. జ్ఞానవంతు లెవ్వరును గర్హింపరు. వీరి చదువు విషయమున నేను జోక్యము కలిగించుకొనకుండుటచే వీ రిట్లగుచున్నారు. దోషము నాయెడనుండ నొరుల దూషించిన లాభమేమి?"

అని యాలోచనఁ దలఁచి కురువృద్ధుఁడు కృపాచార్యులను బిలిచి, 'బాలురకు విద్యాదానముచేసి ధన్యుల గావింపవలె' నని వేఁడుకొనెను. తాను నప్పుడప్పుడు వారికి రాజనీతులఁ గఱపుచుండెను.

రాజపుత్త్రులు కృపాచార్యునొద్ద ధనుర్విద్యాభ్యాస మొనర్చుచుండిరి. అంతఁ గొంతకాలమునకు ఆతని బావ ద్రోణాచార్యులు హస్తినాపురమున కరుదెంచెను. భీష్ముఁ డాతని పాండిత్యము దెలిసినవాఁ డగుటచే అతనిఁ దన మనుమల శస్త్రవిద్యా గురువుగా నేర్పఱచెను. రాజకుమారుఁ లాతనియొద్ద ధనుర్విద్య నేర్చుకొనుచుండిరి. అస్త్రవిద్యాభ్యాసమునఁ గర్ణార్జును లొండొరులఁ మీఱఁ దలఁచుచుండిరి. కాఁబట్టియే కర్ణుఁడు సుయోధన పక్షపాతి యయ్యెను. ద్రోణకుమారుఁ డశ్వత్థామయుఁ బార్థుని యస్త్రవిద్యానైపుణ్యముగాంచి యోర్వకుండెను. ఆకారణమున వాఁడును

సుయోధన పక్షపాతి యయ్యెను. అదినుండియుఁ గర్ణార్జునులకును భీమ సుయోధనులకును విరోధము పెరుఁగుచుండెను.

ఒక్కనాఁడు ద్రోణాచార్యుఁడు రాకొమరుల యస్త్రవిద్యాకౌశలము గాంచవేఁడి కృత్రిమమైన పక్షి నొకదానిని భాసమను పేరుగల దానిని వృక్షశాఖాగ్రమున రచించి దానిని దనశిష్యుల కంటఁబడునటుఁ జూపి,

ద్రోణః—బాలకులారా! మీమీ ధనువుల బాణముల సంధించి సిద్ధముగ నుండుఁడు. నే నెవ్వని నాజ్ఞాపింతునో వాఁడప్పు డాపక్షితలఁ దెగ వేయవలయును.

గురువు నానతిచొప్పున వారెల్లరును సంసిద్ధులైయుండిరి. ద్రోణాచార్యులు మొట్టమొదట ధర్మరాజును బిలిచి;

ద్రోణః—యుధిష్ఠిరా! ఆవృక్షముపైనుండు పక్షిఁ జూచితివా!

ధర్మరాజు:—చూచితిని.

ద్రోణః—ఆపక్షిని నన్నును నీసోదరులను చూచితివా?

ధర్మరాజు:—చూచుచున్నాఁడను.

ద్రోణః—నీదృష్టి చెదరియున్నది. నీ వీపక్షితలఁ దెగనేయఁజాలవు. కాఁబట్టి [illegible].

అని యీప్రకారము ఫల్గునుని దక్కఁ దక్కిన వారలనెల్లఁ బ్రశ్నించెను. అందఱును దమదృష్టి పక్షిమీఁదన వ్యాపించి యున్నదని చెప్పలేకపోయిరి. ద్రోణుఁడు

వారినెల్ల మీరీకార్యమున కనర్హులని నిరాకరించెను. తుద కర్జునుని రావించి;

ద్రోణః—పార్థా! ఆవృక్షశాఖాగ్రమున నున్న పక్షి శిరమును గాంచితివా!

అర్జునః—చూచితిని.

ద్రోణః—ఆపక్షిని నీసోదరులను నన్నును జూచితివా?

అర్జునః—పక్షిశిరము దక్క వేఱేమియు నాదృష్టికి గోచరించుటలేదు.

ద్రోణః—నీవే గురి తప్పని వాఁడవు. కాఁబట్టి నీ బాణమున పక్షిశిరమును ద్రుంపుము.

అర్జునః—దేవరవారి యానతిచొప్పున నేయాచరించెదను.

అని తనచేతి బాణమున దానితలఁ దునిమెను. పాండవులాకార్యము చూచి సంతోషము నొందిరి. కౌరవుల కది దుఃఖావహ మయ్యెను. కర్ణున కత్యంతము నసూయ యుదయించెను. మున్నే ఫల్గునునిపైఁ గల ద్వేష మప్పటినుండి యభివృద్ధమయ్యెను. నాఁటి మొదలు సుయోధనుని యొద్దఁ గొండెములు చెప్పుచుండెడివాఁడు. వీని యుపదేశమున సుయోధనుని మానసమును మార్పు నొందఁ దొడఁగెను.

# అస్త్రవిద్యాసందర్శనము

అథ్యస్త్రవిద్యులగు రాజకుమారుల యస్త్రవిద్యాకౌశలతఁ జూచి ద్రోణాచార్యులు ధృతరాష్ట్రుని వేడుకొనెను. ఆచార్యుని వేడుకోలు ననుసరించి రాజు రంగస్థల నిర్మాణమునకై విదురున కాజ్ఞ చేసెను. అతఁడు విశాలమగు నొక ప్రదేశమున రంగస్థలమును నిర్మించెను. మధ్యమునఁ జత్రాకృతిగా రంగప్రదేశము గావించెను. దాని చుట్టును బందిళ్లు వేయించెను. వానియందుఁ బ్రేక్షకులాసీనులగుట కనువుగా మంచెలఁ గట్టించెను. అవి సోపానములవలె ఒక్కదానికంటె నొకటి యెత్తుగా నుండెను. రాజకుటుంబములోని వారాసీనులగుటకుగాఁ బెక్కు దివ్యాసనములు వేయించెను. ధృతరాష్ట్రుఁడాసీనుఁడగుటకై రాజసింగపు గద్దియ యమర్పించెను. స్త్రీలకొఱకుఁ బ్రత్యేకస్థల మొకటి యేర్పఱచెను. రంగస్థలమున నొరులు ప్రవేశింపకుండులాగునఁ జుట్టును గట్టలనాటించి వానిచుట్టును త్రాళ్లు గట్టించెను. పందిట వితానములు గట్టించెను. చుట్టును దోరణములు గట్టించెను.

అంతనొక సుముహూర్తమున ధృతరాష్ట్రుఁడు భీష్మాది పరివృతుఁడై ఆసనమున కరుదెంచెను. గాంధారియుఁ గుంతి మొదలగు నంతఃపుర కాంతావర్గముతోడ నప్రదేశమునకు వచ్చెను. రాజపరివారమంతయును జయజయ ధ్వానములు సల్పుచు అచ్చటికి వచ్చెను. పౌరజానపదాదు లనేకులు ఆచోటికి తెంచిరి. ఎల్లవారు సుచితాసనముల నలంకరించిరి.

ముందు ద్రోణాచార్యులు రంగస్థలమునకు వచ్చిరి. వారివెంట రాజపుత్రులరుదెంచిరి. అఖిల విద్యార్థులు వచ్చినంత ద్రోణాచార్యులు "మీమీ యస్త్రకౌశల్యములఁ జూపుఁడు" డని యానతిచ్చిరి. కొందఱు కత్తి సాములందలి నేర్పును చూపుచుండిరి. కొందఱు గుఱ్ఱపు యతివేగముగ బాణములు వేయుచుఁ దమ హస్తలాఘవము వెల్లడి చేయుచుండిరి. కొందఱు గదా యుద్ధమునఁ దమకుఁగల నైపుణిని విశదీకరించుచుండిరి. కొందఱు వాహనారోహణము నందలి సామర్థ్యమును ప్రకటించుచుండిరి.

అప్పుడు భీము సుయోధను లొండొరులఁదాఁకి గదా యుద్ధము సేయ మొదలిడిరి. ఒకరి నొకరు మీఱఁదలఁచి వారు సవ్యాపసవ్య చిత్ర మండల గతుల నడచుచుండిరి. నేర్పు మెఱయఁ బరస్పర ప్రహారములఁ దప్పించుకొనుచుండిరి తక్కిన రాజపుత్రులు దానిఁగాంచి యాశ్చర్య పడుచుండిరి. ఆ సమయమున అచ్చటఁగల రాజపుత్రు లొండొరు లిట్లు సంభాషింపఁ దొడఁగిరి.

అర్జున:—తమ్ముఁడా! సహదేవా! చూచితివా మన యన్నగారి కౌశల్యము! సుయోధనుని గదాఘాతములను దప్పించుకొనుటకు కాక మండలగతి నడచి అతని గద నేలఁగూల నేయ నుంకించుచున్నాఁడు.

దుశ్శాసన:—సోదరా! అనువిందా! చూడుము మన యన్నగారి నైపుణ్యము. భీముని ప్రహారములనుదప్పించుకొని యపసవ్యగతి నడచి యాతనిఁ బ్రహరింపను ముకట్టుచున్నాఁడు.

నకుల:—ఆహా! సుయోధనుఁడు మా యన్నకుఁ జిక్క సిద్ధముగ నున్నాఁడు. తప్పక యవమానము పొందఁగలఁడు.

వింజ:—బళీ! పైఁబడనున్న దెబ్బను మా యన్న ఎంత లాఘవమునఁ దప్పించుకొనెను? ఇది గదా కౌశల్యము!

సహదేవ:—అయ్యో! సుయోధనుఁడు మా యన్న దెబ్బనుండి తప్పించుకొనుటయే గాక ఆతనిఁ గొట్టఁబోవుచున్నాఁడు. ఏమి సేయుదుము?

దుశ్శాసన:—ఔటౌటౌ! అన్నగారి గదాఘాతము గుఱితప్పి నేలపైఁబడెను గాని మా యన్న ఇట్లు గుఱితప్పుట దైవవశమునఁ గాకున్న ఇంక దేని వలన?

అర్జున:—దుశ్శాసనా! మా సత్త్వహీనత చూపిన ఇట్టి యుద్ధ మనుట తెలియకున్నావుగా!

దుశ్శాసన:—ఓరీ! మా యన్న యసమర్థుఁడు? ఇది వట్టికల్ల. ఇంకొకక్షణమున నీ యన్న యేమి కాఁగలఁడో చూతువుగాక.

అర్జున:—ముందటి క్షణమున కద్ద మేల కావలయును? రాను రాను బలమెవ్వరికిఁ దగ్గుచున్నదియూ తెలియుట లేదా?

దుశ్శాసన:—బలహీనుని వలె నభినయించినఁగాని శత్రువు సమీపింపఁడు. ఎదుటివాఁడు చెంతకు వచ్చినఁగాని వానిని లోఁగఁదీసికొనుటకు వీలు లేదు. ఇది తెలిసియే మా యన్న యిట్లున్నాఁడు. ఇదియు నొక కౌశల విశేషమగుచున్నది.

అర్జున:—బాగు బాగు! ఏల జాతిహీనవు ఇదియొక తీరగు సాహసు వానిలాగున నాడెదవు. తగ్గివాఁడచ్చి నప్పటి మాట చూచుకొందుములే.

కర్ణ:—ఓరీ! వదరుపోతా! ఇది రంగస్థలము. వృక్ష శాఖాగ్రమున నుండు పక్షులఁ ద్రెంచుట కాదు.

అర్జున:—కఱచూచి బాణము ప్రయోగింపనేరని వాని కింత నోరుండవలసినదే? చాలుచాలు నీ యాడంబరములు మాని యెచ్చటికైన నరిగి రథసారథివి గమ్ము.

వీరి సంభాషణము లాలకించి ద్రోణాచార్యులు ఎచ్చటి రంగభంగ మగునో యని భీతిల్లెను. వెంటనే యశ్వత్థామను బంపి భీమ సుయోధనుల గదాయుద్ధమును మాన్పెను. అర్జునుని బిలిచి మాలిన ధనుర్విద్యా కుశలతఁ జూప నాజ్ఞ చేసెను. ప్రేక్షకులెల్లరును అర్జునుని యప్పటి యాకృతిఁ జూచి యాశ్చర్యపరవశులై పలువురు పలువిధములఁ గొని యాడఁ దొడఁగిరి.

"ఔరా! ఇట్టివానిఁ గనిన యా కుంతీదేవి యెంతటి యదృష్టవంతురాలు! మన్మథ వసంతాముల మీఱు సౌందర్యమును, దానికంటె నెక్కుడగు గాంభీర్యమును, అంతకంటె నధికమగు నడఁకువయును గలిగి యొప్పు చున్నాఁడు."

"అహా! దుర్ధర్షప్రతాపుఁ డయ్యును ఎంత సౌమ్యుఁడుగా నున్నాఁడు. రోషప్రసాదములు రెండును గలిసి

కర్ణుఁ డంతఁ బార్థుఁడు చూపిన కౌశలముల నెల్లను జూపెను. ప్రేక్షకు లతని సామర్థ్యమును గూడ మెచ్చుకొనిరి. ఫల్గునునకు నిగ్గును గోపము నొక్కుమ్మడి నుదయింపఁగాఁ గ్రూరదృష్టుల వానిని జూచెను. గురునానతి లేనందున నేమి సేయుటకును లేక యూరకుండెను. కౌరవు లెంతయు సంతసించిరి. రాధేయుఁ డంతఁ గర్వితుఁడై సుయోధనునిఁ గాంచి;

కర్ణ:—మిత్రమా! ఈ సభ్యులందఱు వారలెల్ల వీక్షింప నేనర్జునునితో ద్వంద్వ యుద్ధము సేయనెంచి యున్నాను. ఆచార్యుల యనుమతియు నీయాజ్ఞయు నైనచోఁ బ్రారంభించెదను. ఇందు జయము నాకే కలుగు ననుట నిక్కము. నీకీ విషయమునఁ గొంచెమైనను సంశయము వలదు.

అర్జున:—నేను నాకౌశలము గురు నానతిని జూపితిని గాని నీవలె సిగ్గువిడిచి వారిని వేఁడికొన లేదు. అది చాలక ద్వంద్వ యుద్ధమున పరాక్రమింతునని సుయోధనుని వేఁడు చుంటివా? నీయెడ గౌరవముండిన వారే నీకాజ్ఞ యొసఁగి యుందురే? తన కొలఁదియు నెవరి కొలఁదియుఁ దెలియక యూరక యేల పదరెదవు?

కర్ణ:—రంగస్థలము శౌర్యవంతులకెల్ల సామాన్యము కదా. ఆచార్యులయెడఁ గల గౌరవమున నడిగితిఁ గాని నాకధికారము లేదని తలఁచకుము. ఒక్కటే నాతో యుద్ధము సేయ భీతిల్లిన నేని 'జితోఽస్మి' యనుము. నేనూరకుండెదను.

సుయోధనః—అర్జునుని మాటల కేమిగాని నీవాతనితో యుద్ధము సేయ నేనిద నీకాజ్ఞాపించుచున్నాడను. నీవింక నెవ్వరి యాజ్ఞకును నిరీక్షింప నవసరము లేదు.

అవల దుర్యోధ నానుమతిచేఁ గర్ణుఁడు పార్థునితో ద్వంద్వయుద్ధముసేయ నారంభించెను. కర్ణుఁ డస్త్రములు వేయ ఫల్గునుఁడు దనయస్త్రములతో వానిని ఖండించెను. అర్జునుఁడు వేసినవానిని గర్ణుఁడు నష్టము చేయుచుండెను. వాఁడి బాణముల రాధేయుఁడు పాండవ మధ్యముని నొప్పించుచుండెను. సవ్యసాచియు వానినట్లే నొప్పించుచుండెను. ఇట్లిద్దరును తీసిపోవక సమానముగా యుద్ధము సేయుచుండిరి. కృపాచార్యునకు మాత్రము, కర్ణునకు సుయోధనాదుల సాహాయ్యముండుటచే వాఁడు ఎచ్చటఁ బార్థుని మీఱునో యను సంశయము గలిగెను కాఁబట్టి కృపుఁడు కర్ణుని గాంచి;

కృపః—ఓయీ! అర్జునుఁడు రాజకుల సంభూతుఁడు. రాజనీతి విశారదుఁడు. అట్టివానితో అజ్ఞాతకుల గోత్రుఁడవగు నీవు యుద్ధము సేయుట తగదు. నీకాలాగున రణమొనర్పఁ గోరికయున్న నీవంశమును దల్లి దండ్రులను దెలుపుము.

కర్ణుఁ డామాటలకు బదులాడ లేక సిగ్గుచేఁ దలవంచుకొనెను. తనకంతటి బల వీర్యములు దేవుఁడేల కల్పించెనని మానసమునఁ జింతించెను.

కృపః—సత్కుల ప్రసూతుఁడును, శౌర్యవంతుఁడును, అధికసేనా సమేతుఁడను రాజనామమున వ్యవహరింపఁబడును. అట్టివాఁడే పార్థునితో యుద్ధము సేయఁదగువాఁడు.

భీష్మః:—కృపాచార్యుని పలుకులు యథార్థములు. కర్ణుఁ డర్జునునితో రణముసేయుఁ దగఁడు.

సుయోధనః:—ఇతఁడు రాజు గాఁడు కావున యుద్ధము సేయరాదనియా మీయభిప్రాయము! ఇదె నామిత్రున కంగ రాజ్యమిప్పించెదను—తండ్రీ! మిమ్మెద్దియుఁ గోరిన వాఁడను గాను. కావున నామిత్రుని విషయమున నేనొనర్చిన యీప్రతి నను బూర్తి గావించి నను ధన్యుని గావింపుఁడు. కాదేని మీ జ్యేష్ఠపుత్త్రుఁ డసత్యవాది యయిన మీ కేకదా యపవాదము!

ధృతరాష్ట్రః:—కుమారా! నీ వసత్యవాదివనుట కే నిష్టపడు వాఁడనుగాను. ఆలోచింపక వీనికి రాజ్యమిచ్చు లాగునఁ దొందరపడి యాడితివే యని చింతించుచున్నాఁడను.

భీష్మః:—ధృతరాష్ట్రా! కానున్నది కాక మానదు. నీ వేల చింతిల్లెదవు? కురుకులమునఁ బుట్టినవా రెవ్వరైనను అసత్య వాదు లగుటకు నే నిష్టపడను. కాఁబట్టి ఈతని వేఁడికోలు పూర్తి గావింపుము.

విదురః:—ఇట్లగుననుట నాకు మున్నే తెలియును. ఇఁకఁ జింతించిన లాభము లేదు.

ధృతరాష్ట్రః:—పుత్త్రకా! నీయిచ్చచొప్పునఁ గర్ణున కంగరాజ్య పట్టాభిషేకము గావింపుము.

సుయోధనుఁ డప్పు డాప్రదేశమున కొక గద్దియ దెప్పించెను. కర్ణునందాసీనునిఁ గావించి బ్రాహ్మణాశీర్వాద పురస్సరముగ వానికిఁ బట్టము గట్టించెను. కర్ణుఁడంత సంతుష్టాంతరంగుఁడై ;

కర్ణ:—సుయోధనా! నీవాచరించిన యీగొప్ప కార్యమునకు నేనేమి ప్రతిక్రియనల్పి నీఋణమును దీర్చుకొనఁ గలవాఁడను?

సుయోధన:—అంగరాజా! నాతో నెప్పుడును జెలిమి వీడకుండుటయే నాకుఁ బదివేలు. ఇంతకంటె నీవలనఁ బ్రత్యుపకృతి నాకేమియును వలదు.

భీమసేన:—సూతపుత్రా! నీకులమునకుఁ దగినలాగున రథచోదకవృత్తి నవలంబించుట మేలుగాని ఈ రాచఱికము నీకేల? "ప్రాప్తేపి సామ్రాజ్యం నవిత్యం నవిముచ్యతే" యనులాగున సుయోధనుఁడు నీకు రాజ్య మిచ్చినను నీసూతత్వము పోఁజాలదు. ఇప్పుడు సూతమహారాజ వగుచున్నాఁడవు. కాఁబట్టి యుత్తమక్షత్రియవంశ సంభూతుఁడగు పార్థునితో యుద్ధము సేయ నీ వర్హుఁడవు కాఁజాలవు

సుయోధన:—భీమసేనా! వీని ముఖ వికాసముగాంచిన వీఁడు సూతపుత్త్రుఁడని చెప్ప వీలుగలదా? లేడికడుపునఁ బులిపుట్టునే? మహాత్ములగు పెక్కురపుట్టువు లెట్టివో యెఱుఁగుదువా? ఈవిదురుఁడును, కృపాచార్యులును, ఆచార్యులవారును, ఎట్లుజనించిరో నీకుఁదెలియునా? ఇంతయేల? మీ జన్మము లెట్టివియో తెలియఁజాలవా?

భీష్మాదులు వీరివాదము పెరుఁగకుండ వలయునని యెంచి "ప్రొద్దు గ్రుంకుచున్నది కాఁబట్టి యస్త్రవిద్యా సందర్శన మింతటితో విరమించుచున" దని యాజ్ఞ చేసిరి. కుమారులఁ బిలిచికొని ధృతరాష్ట్రుఁడును, నారీవర్గమును

వెంటనిడుకొని గాంధారియు నాచోటు వాసిరి. కర్ణుఁడునాఁటి తనపరాభవమున కెంతయు వగచెను. తన పుట్టువును గుఱించి తెలియుట కేమి యుపాయమని యాలోచించెను. తన్నుఁ బెంచిన రాధాసూతులకు నదిలోఁ జిక్కుటకు ముందుఁ దన జననవృత్తాంత మెద్దియుఁ దెలియకుండుటకు మిక్కిలి చింతించెను. తన్నాలాగునఁ గనికరమింతైన లేక నదిలో వైచిన వారలపై నత్యంతము క్రుద్ధుఁడాయెను. వారెవ్వరైనదియును ఎఱుఁగనందున ఆక్రోశము మఱల విషాదముగా మాఱఁగ విషణ్ణముఖుఁ డాయెను. ఈలాగునఁ బరిపరి విధముల వితర్కించుచుండఁగ, ఒక్కనాఁటికైన అర్జునునకు సభామధ్యమున నవమానము గల్పింపక తీఱనని శపథము గావించి యచటనుండి కదలెను. తక్కిన వారెల్లరును వారివారి యునికి పట్టులకు వెడలిరి.

## కుయుక్తి

"అకటా! ఈ పాండవుల మూలమున నాకు సర్వదా తలవంపులు గలుగుచున్నవి. నాఁడు ద్రుపదునిఁ బట్టఁబోయినపుడు అర్జునుఁ డడ్డమువచ్చి జయలక్ష్మిని గైకొనిపోయెను. నేఁడు యుధిష్ఠిరుఁడు యువరాజై నా రాజ్యమెల్ల నపహరించెను. దీనికేమి సేయుదును ? కణికుఁడు తెలిపిన రాజనీతి మన మెల్లరము వినినదే కదా! దానిచొప్పున అపకారు లగువారు

పరులైనను బాంధవులైనను ఔదాసీన్యము వహింపక జాగరూకతతో వారిని దూరమున నుంపవలయును గాని చెంతఁ జేర్చి కొనరాదు గదా!”

శకుని:—సుయోధనా! నీతి కుశలుండగు నామంత్రి యాడినదెల్ల గ్రాహ్యములే యగును. శత్రువులు హీనబలులైన వారిని సంహరింపవచ్చును గాని యహీనపరాక్రములైనచో వారితోఁ గపటస్నేహము గావించుచుండి సమయము గలిగినపుడు సంహరించుట యుక్తము. ధర్మరాజును యువరాజుగాఁ జేసినది నీ తండ్రిగదా! కాఁబట్టి యాతని వనికాతఁడే ప్రతీకారము సేయనగును.

సుయోధన:—మాతండ్రి యాలాగునఁ జేయువాఁడేని ధర్మజునేల యువరాజు గావించును? కావున నది యసాధ్యము.

శకుని:—రాజకుమారా! ఇందులకొక యుపాయము సెప్పెదను వినుము. నీ తండ్రి మూలమునఁ బాండవులను దేశాంతరమునకుఁ బంపవలయును. ఈ విషయమునాతఁ డంగీకరించుట యెట్లని యాలోచించుచున్నాను.

సుయోధన:—మాజనకుఁడు దీని కొడఁబడుటకు నే యుపాయ మాలోచించెదవు?

శకుని:—అతని యెదుట నీ వనుభవించు క్లేశమును జక్కఁగా వివరించుము. పుత్రస్నేహ మెట్టివానికి నలంఘ్యము. అప్పుడాతఁడు యించుక దయార్ద్రహృదయుఁ డగును. ఆ సమయము గనిపెట్టి యుక్తిచేఁ బాండవుల వారణావతమునకుఁ

బంధువులాగునఁ గొనర్చుకొనుము. అందు వారి నివాసమునకై మనకుఁ బరమవిశ్వాసపాత్రుఁడగు పురోచనుని మూలమున లక్కయిల్లొకటి గట్టించెదము. అచ్చట వారు నివసించియుండ నడిరేయి నొక్కనాఁడు ఆ గృహమునకు నిప్పంటించి స్వాపరవశులగు వారిని మరణింపఁ జేయుదము. ఇట్లొనర్చిన మనపై నపవాదము రాఁజాలదు. ఇదియే నా సూచించిన యుక్తి.

సుబోధనుఁ డిదివిని యించుక యనుమానపడెను. మామ చెప్పినలాగునఁ జేసిన ఈలోకమున నపవాదమును దేహాంతమున నరకమును సంభవించునే యని యాలోచించెను. ఏది యెట్లున్నను వారిని అటనుండి తొలగించుట మేలగునని యెంచెను. తానటులఁ దలంచిచో నెచ్చట శకుని వారికి హానిసేయునో యని యాప్రయత్నమునుండి మానఁ దలఁచెను. తులువతనమున భీముఁడును, విశ్వాసమున సజ్జనుఁడును, రాజ్యలోభమున ధర్మరాజును, దన కగ్గు గావించి నందునకుఁ బసివారగు నకుల సహదేవులు మన్నించుట తెలిసి మనస్సంగీకరింపకుండెను. అట్లు యూరకుండినఁ దన కనేక బాధలు గలుగుచున్నవి. వారొండొరుల వీడువారు కారు. అనియెంచి తుదకు మామతోఁ బని యిష్టము చొప్పునే ఆచరింప నిశ్చయించి తండ్రిపాలి కరిగెను. ధృతరాష్ట్రుఁడు కుమారు నాలింగనము చేసికొని వాఁడు కృశించియుండుట తెలిసికొని యాదరిపడి ;

ధృతరాష్ట్రుఁడు:— తండ్రీ ! నీయంగము లిట్లు కృశించి యుండుటకుఁ గారణమేమి ?

యయ్యెనని యూరకుంటినఁ గ్రమముగఁ బాండవ వంశమునకే రాజ్యము రాఁగలదు. మా పుత్త్రపౌత్త్రవర్గమంతయు నిఁక రాజ్యాపేక్ష మాని వారికి దాసానుదాసులై కదా వర్తింపవలయును? రాజ్య పాలనమునకర్హుఁడు జ్యేష్ఠుఁడగుట శాస్త్రసమ్మతమగునది కాదనను గాని కారణాంతరములచేఁ గొన్నిసమయముల శాస్త్ర సమ్మతమగు దానిఁ గూడ విడవలయు ననుట నీకుఁ దెలియదే! మన పూర్వుఁడగు పూరువు జ్యేష్ఠుఁడే? యనువు మున్నగు జ్యేష్ఠులవీడి రాజ్యమాతనికి రాలేదా? తండ్రి కుపకారము సేయునందునను, విజాతీయ స్త్రీ జనితులగుటచేతను యదువు మున్నగు వారు రాజులు కాలేదని యందువేమో! అది యటుండనిమ్ము. భీష్ముఁడు జ్యేష్ఠుఁడు గాఁడే! తాను రాజ్యమును వీడి సత్యవతీ తనూజుని మా తాతను విచిత్రవీర్యుని రాజుగా నొనర్పలేదా? జనకుని వివాహమునకై తానట్టి శపథము గావించెనని యందువేమో? ఎట్లును గారణాంతరములచే జ్యేష్ఠులు రాజ్యమునకురాక కనిష్ఠులు వచ్చిరనుట యంగీకరింపక తీరదుగదా! మీ రాజ్యమునకు మీ కుమారుఁడు రాజగుటయు నట్లే యొక కారణమని యెంచుఁడు. వేయేల? వారి నిటనుండి యెచ్చటికేనిఁ దఱుముకుండిన నే నాత్మహత్య గావించుకొని మరణింతును. ఇది నిశ్చయము.

ధృతరాష్ట్రుః—కుమారా! అమంగళములు వచింపకుము. నాకు మాత్రము పుత్త్రప్రీతి లేదనియా యెంచెదవు? కొంత యోరిమి వహించియుండుము. కార్యమొకతీరున పరిష్కరింతును.

సద్గుణ విరాజితులగు వారినిఁ జప్పన నూరు వెడలఁదఱిమినఁ బౌరులేమని యెంచుదురు? తొందర పాటు పనికిరాదనుట యెఱుఁగవా? ఇంతకాలము మిక్కిలి యాదరము చూపు చుండిన నేను వారితో నిట్లు కఠినోక్తులు పలుకఁగలను? చెప్పితివి కో! భీష్మాదు లందులకు సమ్మతింతురే? వారికిష్టము లేని కార్యములు మన మాచరించిన అంతః కలహములు గలుగును. కాఁబట్టి రాజ్యాభివృద్ధి గోరువాని కెప్పుడును ఇట్టి సేఁతతగదు.

సుయోధన:— మీ కారిష్టపడిన భీష్మాదు లెదిరింపఁజాలరు. అశ్వత్థామ నాయెడ ననురక్తుఁడు. పుత్రస్నేహమున ద్రోణాచార్యులును, బావను విడువఁజాలక కృపాచార్యులును నాయెడఁ బ్రసన్నులు కాఁగలరు. పితామహుఁ డుభయుల యెడను సమానప్రీతి గలవాఁ డగుటచేఁ దటస్థుఁడై యుండుటయె కాక మన పక్షమునఁ జేరినను జేరవచ్చును గాదా! ఇంక విదురుఁ డొక్కఁడే కదా యవశిష్టుఁడు! అతఁడు పాండవపక్షపాతియే యైనను ఒంటరి యగుటచే ఏమియుఁ జేయఁ జాలఁడు. ఇందు దోషమేమి గలదని జనులు దూషింపఁబోయెదరు? పట్టణములలో నెల్ల వారణావతము మిక్కిలి పొగడ్త గాంచినది. ధర్మరాజు దైవభక్తుఁ డగుటచేఁ బశుపతి నివాస మగు నాపురమునకు అతనిఁ బొమ్మనినఁ దప్పక యంగీకరింపఁగలఁడు. రాజ్యములోనివారు మనకుం లోఁబడిన యావల వారిని మరలరావింతము. వారికినిఁ గొంత రాజ్య భాగమిత్తము.

మాటఁజొచ్చెను. కాఁబట్టి యాఁతఁడు లాక్షాగృహ నిర్మాణము మున్నగువానియందు శకునిమతమును సమర్థించెను. విదురుఁడు వీరి కుయుక్తిని దెలిసికొని మెల్లఁగ ధర్మతనయునితోఁ జెప్పెను. దానికివలయు ప్రతీకారమును అతనికిఁ జెప్పి పంపెను. సుయోధనుఁడు నాఁటి మొదలు పౌరజానపదాదులు దనయెడ ననురక్తులగులాగున సామ దానముల మూలమున వారిని సంతృప్తులం గావించుచుండెను.

## గదావిద్యాభ్యాసము

బలరాముఁడు దన చెలికాఁడగు మిథిలేశుఁ జూడ నెంచి విదేహమునకు వచ్చియుండెను. ఇది తెలిసి సుయోధనుఁ డాతనియొద్ద గదావిద్యను జక్కఁగా నభ్యసింప నెంచి యచ్చటికి వచ్చెను. బలరాముని చెంతకరిగి యాతనికి నమస్కరించెను. రాముఁడు నాతని నాశీర్వదించి;

“సుయోధనా! నీతండ్రికిఁ గుశలమే? అంధుఁడగు నీ జనకుని వీడి యిల్లేల వచ్చితివి? నీ విటువచ్చిన రాజ్యతంత్ర మరయువా రచ్చట నెవరు గలరు? భీష్ముఁడు వృద్ధుఁడు గదా! ధర్మసుతుఁడు జీవించియుండిన మీతండ్రికిఁ జేయూఁతగా నుండెడివాఁడు. పాప మాతఁడు దన మాతృసోదరులతోడ లాక్షాగృహమున దగ్ధుఁడయ్యెనఁట గదా! ఇట్టి సమయమున నీవిటువచ్చుట సరియే?”

"బావా! పెక్కు దినములనుండి మీవలన గదా విద్య నభ్యసింప వలయునని యెంచియుంటిని. కాని నేఁటి వఱకు నాకట్టి సమయము చేకూఱదయ్యెను. మీరిచ్చటికి వచ్చి యుండుట తెలియుటచే మీవలన నావిద్యను సాంగోపాంగ ముగ గ్రహింప నెంచి వచ్చియున్నాను. ద్వారక యందుండ మీయొద్ద కరుదెంచి నావాంఛితమును దెల్పిన ఎచ్చట మీ సోదరుని మూలమునఁ గార్యహాని యగునో యను వెఱపున నచ్చటికి రానైతిని. అదేమి పాపమోకాని కృష్ణునకు నాపై నకారణద్వేషము జనించి యున్నది. మీరును సోదర ప్రియు లగుటచే నామాటల పాటింపకుందురేమో యని తలఁచియే యింతకాలము సమయ నిరీక్షణము సేయవలసెను"

"ధృతరాష్ట్రతనూజా! కృష్ణుఁడు పాండవ పక్షపాతి. నీవాదినుండి వారల ద్వేషించుచుంటివి. ఆకారణమున నీపైఁ గృష్ణునకు విరోధ ముదయించుట సహజము. నేను మీ యుభయులయెడ సమభావము గలిగి వర్తించు వాఁడను. కాఁబట్టి నీ వేపట్టున నేది యడిగినను గాదను వాఁడను గాను. నీకెప్పటికి నట్టిసంశయము వలదు."

అనియాడి నాఁటి మొద లాతనికి గదావిద్యయందలి మర్మములఁ గఱపుచుఁ గ్రమముగ గదాయుద్ధ కుశలుని గావించెను. సుయోధనుఁ డప్పుడు దన మది నిట్లు తలపోయఁ జొచ్చెను.

"అయ్యో! భీముఁడు సజీవుఁడై యుండకపోయెనుగా! అతఁడు బ్రతికి యుండిన నామదిఁ గసిదీఱ వానితో యుద్ధము

చేసి జయించి సంతుష్టుఁడ నగుదును గదా ? తొలుదొల్త గదా విద్యాభ్యాసము బలరామునొద్ద నేర్వవలయునని యెంచినది వానికొఱకే కదా ? ఇప్పుడు ప్రయత్నించిన కార్యమును జక్కఁబఱచికొనుట ముఖ్యమని యెంచి వచ్చితి నంతియకాని లక్ష్యమును బోఁగొట్టికొంటిని గదా ! నా తెలివి లేమిని వాని జంపుకొని యిప్పుడు చింతించిన లాభమేమి ? ఎప్పుడును శత్రువును ప్రాణముతో నునిచి కసిదీఱ వాని బాధించుట సరికాదని తలఁచినపుడే చంపుట సరికాదు. వానితోఁబాటు వాని తల్లిని భ్రాతలను గూడ జంపించితిని. క్రుద్ధుఁడగువాఁడు ముందువెనుకలారయలేఁ డనుట నాయెడ సరిపోయెను. వాఁడిపుడు సజీవుఁడైయుండిన వాని జయించి నా దాసునిగా జేసికొని యుందును. వానితోఁబాటు వాని భ్రాతలును నాకు దాసానుదాసులై యుందురుగాదె! ఇంతకును నా యవిమృశ్యకారితయే కారణము.”

అని తలఁచుచుండెను. బలుఁడును దన శిష్యుని చుఱుకుదనమున కెంతయు మెచ్చుకొనుచుండెను. ఇట్లు బలరామునిచేఁ జక్కఁగా శిక్షితుఁడై యాతని యాజ్ఞవడసి సుయోధనుఁడు హస్తినాపురమున కరిగెను.

# అర్ధరాజ్య దానము

"రాజేంద్రా! నాఁడు కాంపిల్య నగరమున మత్స్య యంత్రమును దెగనేసినవాఁ డర్జునుఁడఁట. కుంతి యాజ్ఞచేఁ బాండవు లేవురును ద్రౌపదిని వివాహమాడిరఁట. భీముఁడు బ్రదికియున్న వాఁడని తెలియుటచే బలరామునొద్ద నే నభ్య సించిన విద్యకు లక్ష్యము చిక్కెనుగదా యని సంతోష మొకవైపున నాకుత్సాహశక్తి నభివృద్ధి పఱచుచుండినను శత్రుఁ డుత్కర్షమును బొందియుండుట విని యోర్వలే కున్నాను. అభిమాన ఘనుఁడగువాఁ డెవ్వఁడరుల వైభవ మును జూచి యోర్వఁగలఁడు? నే నెద్దియేనిఁ జెప్పఁదలఁచి వచ్చిన నప్పుడెల్ల విదురుఁడు మీచెంతన యుండును. కాఁబట్టి నే నేమియుఁ బలుకలేక యూరక వెడలి పోవుచుందును. అతఁడు పాండవ పక్షపాతి యగుట మీకెఱిఁగియు జెంతఁ జేర్చుకొనుట యెంతయు ననుచితము."

అని కర్ణసహితుఁడగు సుయోధనుఁ డొకనాఁ డేకాంత మున నున్న తండ్రిం గాంచి పల్కెను. ధృతరాష్ట్రుఁడును కుమారుని మాటలు విని;

ధృతరాష్ట్రు:—విదురుఁడు మున్నె ద్రౌపదీ వివాహాదిక ములు నాకెఱిఁగించెను. పాండవులకు వివాహ మయినందులకై నీవేల చింతింపవలయును? సుందరియగు భానుమతిని నీవు వివాహమాడియుంటివిగా! విదురునిఁ దొలఁగఁద్రోసిన మన కపవాదము గలుగును. అతనియొద్ద నీవైఁగల క్రీతిని

పెల్లడించుట లేదు. అది యటుండనిమ్ము. పాండురాజ పుత్త్రులు దైవరక్షితులు. కావున వారి నొరులెన్ని విధముల బాధించినను అవి సఫలములు గానేరవు. ఆకారణమున వారియెడ నీకు విరోధము వలదు.

సుయోధనః—నామాటలు సాంతముగా వినక మీరిట్లు పలుకుట యుక్తముగాదు. పాండవులు పాంచాలుని యొద్ద నున్నారు. వారలతో బలరామ కృష్ణులును, యదు వృష్ణిభోజాంధకాదులును గూడిన వారప్పుడ జేయుల గుదురు గదా? కావున వారిని ద్రుపదునొద్దనుండి వేఱు కఱుప వలయును. ఎట్లును శత్రుపక్షము బలహీనము గావలయును. పాండవ పాంచాలులకును, గాంగేయ మాద్రేయులకును, ద్రౌపదీ పాండవులకును బరస్పర ద్వేషము గలిగింపవలయును. ఏయుపాయమున నైనను వారిని లుప్తబలులఁ గావించినఁగాని వారు మనకు వశులు గానేరరు.

కర్ణుఁ డీమాటలు విని నవ్వుచు;

కర్ణః—ఆర్యావర్తమునఁ డను, గుణపాత్రుండునగు పాంచాల రాజు తన యల్లుర విడుచుట యసత్యము. గుణసంపన్నుఁడగు ధర్మరాజును, అన్నమాటల నిరాకరింపలేని యతని సోదరు లును గౌరవింపఁదగిన మామయొక్క ద్వేషము వహించుట యబద్ధము. కావున వారలయొక్క భేదోపాయమును బ్రయో గింప వీలుగాదు. సతీతిలకమగు ద్రౌపది పాండవులయొక్క విరక్తయగుట కల్ల. ప్రీతిని బెండ్లియాడిన పాండవు లామెయెడ విరోధము వహించుట కలలోని వార్త. కావున వారి

స్నేహమును భంగము సేయఁ గడఁగుటకు వలనుగాదు. కౌంతేయ మాద్రేయులాదినుండి భేదములేక ఏకగర్భ జనితులఁ బలెనుండ వారిని విడఁదీయ నెంచుట యుచితమా. బహిరంగముగ యుద్ధమున కరిగి ద్రుపదుని జయించి పాండవుల బంధించి తెచ్చుట దక్కఁ దక్కిన వెవ్వియు సరిగావు.

ధృతరాష్ట్రః:—యుద్ధసందర్భము భీష్మాదులతో నాలోచింపక చేయుటకు సాధ్యము గాదు.

అని చెంతనుండు నొక సేవకుని మూలమున భీష్మాదుల రావించెను. ధృతరాష్ట్రుఁడు వచ్చినవారి స్వాగతములాగున సత్కరించి యుచితాసనాసీనులఁ గావించి;

ధృతరాష్ట్రః:—పాంచాలునిపై యుద్ధమున కరిగి వానిని జయింపవలయునని కర్ణుఁడు నుడువుచున్నాఁడు. ఇందు మీయభిప్రాయ మేమి?

భీష్మః:—కౌరవ పాండవు లిరువురును నాకొక్క రూపువారే. నే నిరువురను సమానముగానే ప్రేమించుచున్నాను. ఇప్పుడు పాంచాలునిపై దాడివెడలుట పాండవులపై యుద్ధమునకుఁ బోవునలాగుననే యగును. అద్దానికి నేను సమ్మతింపఁ జాలను. పితృ పైతామహమగునట్టి ఈ రాజ్యమునకు మీయట్లు వారు నర్హులు! కాఁబట్టి వారి కర్ధరాజ్య మిచ్చుట మీకు శ్రేయోదాయకము. కీర్తివిహీనుని జన్మము నిరర్థకము. నశ్వరమగు ధనముపై నాసయుంచి శాశ్వతమగు యశస్సును బోనాడు కొనకుఁడు. పాండవులకుఁ బైతృకమగు రాజ్యమును బంచియిచ్చి వారితో స్నేహముగలిగి వర్తింపుఁడు.

ద్రోణః—సుయోధనా! కురువృద్ధుఁడగు పితామహుని మాటలు యథార్థములు. వారు చెప్పిన నడచు కొనుము. పాండవులతో విగ్రహముచేయఁ గడఁగకుము. కర్ణాదులమాటలు విని వారలతోడ వైరము పెంచుకొనకుము. వారు సత్యశీలురు. ధర్మనిరతులు. అట్టివారితో నీకేల విరోధము? వారి కర్ధరాజ్యమిచ్చి సుఖింపుము. ఇప్పుడే పాండవులకును, పాంచాల రాజునకును, ధృష్టద్యుమ్నాదులకును ప్రియపూర్వకముగా భూషణాంబరాదులఁ బంపుము. పాండవులఁ దత్క్షణమే రప్పింపుము.

కర్ణః—సుయోధనా! ఈ ముసలులు చిత్తస్థైర్యము లేని వారగుటచే ఇట్లు పలుకుచున్నారు. వీ రెచ్చటనయినఁ గూర్చుండి తమకుఁ దోఁచిన గ్రంథమును జదువుకొనుచుఁ బ్రొద్దు పుచ్చుచుండక రాజునకు హితబోధలు సేయ నేల రావలయును? మంత్రులెలాగునఁ బల్కినను వారి సాధుత్వాసాధుత్వముల విచారించుట రాజునకు విధియగును. రాజు ఎప్పుడును స్వబుద్ధి నుపయోగింప వలయును. వీరి పలుకులు విశ్వాసార్హములుగావు.

భీష్మ ద్రోణులు కర్ణుని వాక్యములు విని కుపితులై;

“కర్ణా! మేము సుహితము పల్కెడివారమును, నీవు హితము సెప్పువాఁడవా? నీవొనర్చిన దుర్నీతిమూలమునఁ గదా యింత వాటిలెను? ఇంత చేసినదిఛాలక ఇంకను మా యెదుట నోరెత్తెదవా?”

విదురుఁడు:—రాజేంద్రా! భీష్మ ద్రోణులు ధర్మవిదులు. సత్యము వచించువారు వయోవృద్ధులు. వారు చెప్పిన లాగున మెలఁగుట మేలు. వారికంటె నీకౌరులు హితులు లేరు. ఈ సుయోధనాదులు బాలురు. కాఁబట్టి ధర్మాధర్మముల నారయుటకు వీరేపాటివారు! వీరిపలుకు లాదరణీయములుగావు. తత్క్షణమే పాండవుల రావింపుము. వారల కర్ధరాజ్యమిచ్చి గౌరవింపుము. వారికి దైవమానవ సహాయములు గలవు. అట్టివారి నుపేక్షించుట క్షేమావహము గాదు. వారి పరాక్రమ మెల్లవారికిని దృష్టపూర్వమే. అట్టివారి విగ్రహము నాశమునకుఁ గారణమగును. సుయోధనా! నీవు వీరి బోధనలకు లోఁబడి యిట్టి వంచనలోఁ బురోచనుని మూలమున నక్రమ కార్యము సేయ నుపక్రమించితివి. కాని యది ఫలింపదయ్యెను. కార్యమువ్యర్థమైనను భీమార్జునులు దాని మఱచువారు గారు. ఇప్పుడు వారిని బిలిచి యాదరించిన ఆయపయశము పోవుటయే కాక వారలను ప్రీతులఁ గావించినట్లగును. భూపాలా! తప్పక వారల రావింపుము.

ఇదివినిన సుయోధనుఁ డిట్లని వితర్కింపఁ దొడఁగెను.

"ఆహా! నే నాదినుండి యూహించిన లాగుననే యాయెను. అకార్య మెంతగుప్తముగా నాచరించినను అది బయలుపడక తీఱదు. ఈవిషయము ఈతనితోఁ బెక్కుతడవలు చెప్పియుంటిని. ఈశకుని తానెంతో గుప్తముగా నాచరించితి నని కదా పలికెను! ఏది! అది దాఁగియుండ నేర్చెనే! గుట్టు బట్టబయ లయ్యెనుగా! 'రాజరాష్ట్ర కృతంపాప' మ్మనులాగున

వీరాచరించి నందునఁ గలిగిన యపనింద నాకుఁగదా కలుగు చున్నది? ఇంతకును గతమునకు వగచి యేమిలాభము? ఇంద టిట్లు పట్టుగాఁ జెప్పునప్పుడు నే నెదిరించినచో ఆయకార్యా చరణమునకు నేన కారకుఁడనుట స్థిరపడిపోవును, కాఁబట్టి యిప్పుడు మౌనము వహించుటయే మేలగును.''

అని తలపోసి యూరకుండెను. ధృతరాష్ట్రుఁడు దానిప్పు డుపేక్షించిన లాక్షాగృహ దహనమునకుఁ దనకొడుకుఁ గారకుఁ డని స్థిరపడిపోవుననుట యెఱిఁగినవాఁడు కాఁబట్టి విదురునిఁ గాంచి ;

ధృతరాష్ట్రు:–విదురా ! నీవును భీష్మ ద్రోణులు నాడు మాటలకునే నన్యథా యాచరించువాండనే?

అని ధృతరాష్ట్రుఁడు నాఁటి సభ చాలించెను. విదురు నంపి ద్రౌపదితోడఁ బాండవులఁ గుంతిని హస్తినకుఁ బిలిపించెను. పాండుసుతు లంబికాతనయుని పాదములకు మ్రొక్కిరి. అతఁడు వారరణ్యమునఁ గుడిచిన యిడుమలకుఁ గడు దుఃఖించుచు ; "విధిఁ గడువనేరు శక్తులు? కాఁబట్టి యావిషయము మఱచిపొం"డని యోదార్చెను.

ఆవల వారి నాదరించి యర్ధరాజ్యమిచ్చెను. ఇంద్ర ప్రస్థమును వారికి రాజధానిగా నొనర్చి రాజ్యపాలనము సేయ నియోగించి యంపెను.

# సభానిర్మాణము

"మామా! నీవును నాఁడు పాండవుల రాజసూయ యాగము చూచితివిగదా! ఎట్టిరాజులును వారికి వశులై మిక్కుటమగు కానుకలనిచ్చి వారి నాదరించిరి. అది కదా చక్రవర్తిత్వము! నిర్గంధ కుసుమములాగున నున్నవాని జన్మమేల? అగ్నినుండి స్వర్ణము గలిగినదనుట యసత్యము కాదు. అది వారి యజ్ఞము మూలమున నాకు అనుభవసిద్ధమయ్యెను. ఆ స్వర్ణరాశి తలఁపునకు వచ్చుకొలఁది రాత్రిందివము నా మదిని దహించుచున్నది."

"అల్లుడా! వారి యైశ్వర్యమెల్లను నీవనుభవింపఁ గలవు గాని నీతండ్రి యానతి గావలసియున్నది."

"ఐశ్వర్యమబ్బుట యటుండనిండు. మీరాదినుండి యేదియో కుట్రపన్నుచునే యున్నారు. ఒక్కటియైనను సఫలమగుట లేదు, తుదకది విపరీతముగాఁ బరిణమించి నా ముప్పునకే కారణమగుచున్నది."

"నీకు నా మాటలలో విశ్వాసమున్నలాగునఁ దోఁచుట లేదు. నేనేల నీకుగా జోక్యము కలిగించుకొని యపవాదముల పాలు గావలయును? నే నాచరించునట్టి పని యొక్కొక్కటియు నీమేలును గోరియే కాని స్వార్థపరతచే నేమియుఁ జేయుట లేదు."

"మాతులా! కోపగించుకొనకుము. నామది కలఁక వాఁటి యుండుటచే న్యాయాన్యాయ పరిశీలన చేయలేక

యున్నది. దాన నే నేవేని బరుషోక్తు లాడిన క్షమింపవల యును గాని యాగ్రహింప నగునా ? అజాత శత్రుఁడగు నాతని యెడఁ గుట్ర నాచరించినఁ బాపములకు మూలమగును గదా యని భావించి యిట్లాడితిని.”

“నేఁ జెప్పఁబోవునది యిట్టిదని తెలియకమున్నే నీవది కుట్రయని భావించుట సరికాదు. అది యటుండ నిమ్ము. ‘సాహసించి చేయఁదగ దెట్టి కార్యం’ బనుట నీ వెఱుఁగవా ? కాఁబట్టి యాలసింపక వెంటనే నీతండ్రి యొద్దకు రమ్ము. అట నంతయు వివరింపఁగలను.”

వీరిటు సంభాషించుకొనిన పిమ్మట ధృతరాష్ట్రునిపాలి కరిగిరి. అతఁడు గొడుకు నొడలంటి చూచి కడు దుఃఖితుఁడై;

“వత్సా ! కౌరవైశ్వర్యమున కెల్ల నీవకదా రాజవు ! పరిజనులెల్లరు నీ యాజ్ఞానువర్తులై యున్నవారు. సర్వ సౌఖ్యములఁ దులఁదూగుచున్నావు. అట్టి నీదేహ మీలాగునఁ దఱుఁగుటకుఁ గారణమేమి ?”

“బావా ! పాండవుల రాజసూయయాగ మీతని కార్శ్యమునకుఁ గారణము.”

“కుమారా! వలయునే నట్టి యాగముల వేయింటిని నీవు సేయవచ్చును గదా! ఈమాత్రమునకై ఇంతకృశింప నేల?”

“తండ్రీ! వినుము ! ధర్మరాజు రాజసూయ యాగ మున నను రత్న పరిగ్రహణమునం దునిచెను. సర్వరత్న ములకు స్థాన మతని గృహము. క్షత్రియకుల యందు

ఏరాజుల యైశ్వర్యమును వారి యైశ్వర్యముతో సమానము గాఁజాలదు. లక్షబ్రాహ్మణులు భుజించిన యొక్కొక్కసారి మ్రోగు పట్టిశంఖ మొక్కటి నిమునమీని నిలువక శబ్దించుచుండెను. ఆవైభవమును జూచి నేను వెంవెంట బోవుచుంటిని. అదిగాంచి కృష్ణ సాత్యకులును, ద్రౌపదీ పాండవులును నను బరిహసించిరి. జనకా! మఱియొక విశేషము వినుము. మయనిర్మితమగు సభను గలయఁజూడ నే నరుగుచుండ తెఱచి యున్న ద్వారముల మూయఁబడిన లాగునఁ దోఁచుటచేఁ జొర నొల్లకుంటిని. ఇట్లే నాకచ్చటఁ బెక్కుభ్రమలు గలిగెను. ఇది చూచుచుండిన ద్రుపదపుత్రిక నను జూచి గొప్పధ్వనితో నవ్వెను. నా ప్రాణవాయువు తనతోడ లాచరించిన యా కార్యమునకు మెచ్చుకొనుటకు వలె నా శరీరమునుండి వెలుపలికి రానున్నది."

అల్లుఁడా! ఈమాత్రమునకే యింత చింతింపనేల? నీకు వారి యైశ్వర్యమునెల్ల సులభముగా సంపాదించి యిచ్చెదను."

'ఏయుపాయమునైనను ఆచరించుటకు మున్ను అది యుపాయమా హితమా యనుట యాలోచింపవలయును."

"బావా! వఱకుమున్నే ఱాలు రువ్వనేల? నామాట సాంతముగా విని యావలఁగదా ఇది యుక్తమిది యయుక్తమని చెప్పనగును! ముందే మీరిట్లడ్డము పలుకుచుండిన నేఁజెప్పు టెట్లు?"

"ఏపనిగాని విమర్శించి చేయవలయు నని యంటిని గాని నీమాటలు వినరాదని నా యభిప్రాయము కాదు."

"సుయోధనా! ధర్మజునకు జూదమున మిక్కిలి ప్రియము గలదు గాని నావలె నాతఁడు ఆయాటలోని మర్మ మెఱుంగఁడు. కాఁబట్టి యతని నోడించి వాని వైభవమెల్ల నీ కర్పించెదను."

"జనకా! మామయ్య చెప్పు నుపాయమున హింసా కార్యమేమియు గావించుట లేదు గాని జూదమాడుట యక్రమకార్యమగునేమో యని యాలోచించెదను."

"కుమారా! నేనును అదియే యాలోచించుచున్నాను జూదమాడుట శాస్త్రగర్హితమని నా యభిప్రాయము."

"బావా! ద్యూతక్రీడ రాజనీతి ప్రసిద్ధము. అది యెప్పటికిని గర్హ్యము గానేరదు."

"శకునీ! నీతిశాస్త్ర పారంగతుఁడు విదురుఁడు అతనితో నాలోచించి జరుపనగును గాక."

"బావా! పక్షపాతియగువానితో ఆలోచన చేయుట తగునా? అట్టివానివలన న్యాయము బైటపడఁజాలును?"

"తండ్రీ! మామ చెప్పుట యథార్థము. విదురుఁడు పాండవ పక్షపాతి. కాఁబట్టి యతఁడు ద్యూతక్రీడ శాస్త్రగర్హిత మనియే చెప్పును."

"బావా! రాజు తెల్లప్పుడు స్వబుద్ధి నుపయోగింపవలయును"

"జూదమాడుటకొఱకు మీరిప్పటికి రండని వారికిఁ జెప్పిపంపుట నాకు ఉచితముగఁ గనఁబడి తోఁచుట లేదు."

"అందుల కొక యుపాయము దెల్పెద వినుఁడు. నానారత్న విచిత్రితమగు నొక సభను నిర్మింతము. దానిఁ జూచునిమిత్తము ధర్మరాజాదుల నిచ్చటికిఁ బిలిపింపుఁడు. ఆవలపని నా యధీనము."

"మండప నిర్మాణము మనచే నున్నది కాని ధర్మజాదులఁ బిలిపింప నచ్చినవాని నొక్కనిఁగా వంపవలయును."

"బావా! విదురుఁడే దానికిఁ దగువాఁడు."

"అట్లే యొనర్చెదను."

వెంటనే ధృతరాష్ట్రుఁడు పాండవుల రావింప విదురునిఁ బంపెను. సుయోధనుఁడిది యుక్తమగునా కాదాయని మది నొక్కింతకాల మూలోచించి తుదకు ద్యూతక్రీడ సరియగు నదియే యని తీర్మానించుకొని సంతుష్టుఁడయి శకునితోడ నటనుండి వెడలి, పెక్కుర శిల్పాచార్యుల రావించెను. విశేష ధన వ్యయముచేసి మయనిర్మితమగు నాపాండవుల సభాభవనముతో సాటి దనఁదగు నొక మండపమును గట్టించి పాండవుల రాకకై నిరీక్షించు చుండెను.

---

# రథికులు

ఆకాశ మధ్యగతుఁడగు సూర్యుఁడు అత్యంత ప్రతాప శాలియై విరాజిలుచుండెను. ఆతపమునకని భీతిచే యెల్లరును వారి వారి యావసథములందు యుండిరి. ఆసమయమున హస్తినాపుర రాజవీధి నొకరథము వచ్చుచుండెను. ఆరథమున నేవురు

రథికులు సింహాసనమునందు నుండిరి. రథికులచెంత పతి రొక్క యాసనమున నొక్కఁడాసీనుఁడై యుండెను.

రథికులలో నొక్కఁడు రత్నకిరీటము ధరించియుండెను. ఆజానులంబులగు బాహువు లాతనికిఁ బెట్టని భూషణములయి యొప్పుచుండెను. అతని మోమునందలి తేజస్సాతని మహారాజత్వమును వెల్లడి సేయుచుండెను. అతని కుడివైపున నొక్కఁ డాసీనుఁడై యుండెను. అతఁ డున్నతకాయుఁడై పొడవునందు లావుగలిగి యొప్పుచుండెను. అతనిహస్తము నందలి గదాదండ మాతని శూరత్వమును బ్రకటించుచుండెను. అతని ప్రక్కనఁ దెల్లని యాకృతిగలవాఁ డొక్కఁ డమరియుండెను. జయంత వసంతాదులనుగూడఁ దిరస్కరింపఁ జాలు నాతని సౌందర్యము కామినీజన కాముకముగ నుండెను. కరమున ధరించియుండు చాప మాతఁడు ధన్వి యగుటఁ దెలుపుచుండెను. కిరీటధారియగు వాని యెడమ ప్రక్కన యిద్దరు యువకులాసీనులై యుండిరి. వీరుభయులును ఆకారముల నొండొరుల నించుకయు భేదింపకుండిరి. ఈ యేవురిలోఁ గిరీటధారి వీరికంటెఁ గొంచెము వయసు ముదిరిన వానివలెఁ దోఁచుచుండెను.

ఈ రథికుల కించుక దూరమున నాసీనలగు నంగన లిరువురలో నొక్కయామె యువతి. ఆబిక నల్లని చాయగలిగి యుండినను మిక్కిలి లావణ్యముతో విరాజిలుచుండెను. ఆబిక యాకారసౌష్ఠవము చూడ మహారాజపుత్రికయగుట చెప్పకయ తెలియుచుండెను. ఆమె మోమించుక సేపు చూచు

చుండిన అనిర్వచనీయమగునట్టి యొకవిధమగు శక్తి ఆమె నావహించి యుండులాగున దోఁచుచుండెను. ఆమె ప్రక్కన నందుండిన వేఱొక యామె వృద్ధవనిత. వీరిరువురిలో యువతి శరీరమునిండ భూషణము లనేకములు దాల్చియుండెను. వారి యప్పటి యాకారములను గాంచినంతనే వృద్ధ వితంతువనుట విశదమగుచుండెను. ఆ రథమున వచ్చుచుండిన రథికవరు లొండొరు లిట్లు సంభాషింపఁ దొడఁగిరి.

"అన్నా! వీరూరక మనలఁ బిలుపనంపి యుండరు. వయసు చెల్లినవాఁడయ్యును రాజిట్లు వీరి మాటలకు లోఁబడి యకార్యములఁ గొడిగట్టుచున్నాఁడుగా!"

"తమ్ముఁడా! నీ వెప్పుడు నిట్లు మోటుతనము గలిగి యుండుట బాగుగాదు. బాల్యమునుండి నీవు వారియెడ నాచరించుచున్న మోటుపనియే వారి యసూయకు మూలకారణము. దానికిఁ దోడు నీగదావిద్యాకౌశలము నగుచున్నది. ఎవ్వడు నొరుల నోనాడుటలో లాభమేమి?"

"అన్నా! చిన్నయన్న తప్పేమియుఁ బలుక లేదుగా! ముదుసలియయ్యును ఈ రాజున కీదుర్బుద్ధి యేలయని కదా యాతఁడు నుడివెను?"

"అగ్నికిఁ దోడు వాయువుకు జేరినలాగున నున్నది. బాగు బాగు! మీకట్టి యభిప్రాయము గలిగియుండిన వారును మీయెడ నట్టి యభిప్రాయము గలిగియుందురో యాలోచించితివా? ఈకంటి కాకన్నెంతదూరమో అకంటి కీకన్ను నంత దూరమే యనుట యెఱుఁగవా?"

రథికు లిటు సంభాషించుచుండఁగ వారికించుక దూర మున నాసీనుఁడగువాఁ డిట్లనియెను.

“ఓ రథికవరులారా! మీ రేల వాదులాడెదరు? ముదు సలి కొడుకులయిష్టము ననుసరించువారు. వారుతమ మాతులు నిచ్చుచోవ్వాన నడుచువారు. వాఁడ్రక్రమముల కుఁగిపట్టు. ఆ లాగుననుండఁగా రాజుచర్యలతో నక్రమములెల్లు లేకుండును?”

అని యాతఁడు పలుకుచుండఁగనే రథము రాజసౌధ మునొద్దవచ్చి నిలిచెను. రథములోని వారిల్లను నగరులోని కరిగిరి.

## జూదము

ధృతరాష్ట్రు నానతిని పాండవులు హస్తినాపురమునకు వచ్చిరి. అటరాచనగరునఁ బ్రవేశించి గాంధారీ ధృతరాష్ట్రాది గురుజనములకు నమస్కరించి వారివలన దీవనలఁ బడసిరి. సుయోధనాది సోదరవర్గము నాదరించిరి. బాంధవు లనేకులు రాఁగా వారి యోగక్షేమము లారసిరి. వీరూరికి వచ్చుట దెలిసి మిత్రులు పెక్కురు రాఁగా వారితో నిష్టకథాగోష్ఠి సల్పు చుండిరి. సుయోధనానుమతిచే నెక్కుడు శ్రద్ధతోఁ బరిజనులు సత్కరించుచు వారికుత్సాహమును వృద్ధిపఱచుచుండిరి.

అంత సుయోధనుఁడు వారిని సమీపించి;

సుయోధన:— అన్నా ! నేనొక సభా భవనమును నిర్మించి యున్నాను. మీరు సోదరసహితులై యిటకువచ్చి దాని యందమును జూడవలయునని నాయభిప్రాయము.

ధర్మరాజు:— సోదరా! నీమాటల కన్యథా వచింతునే! తప్పక నీవెంటనే మేమెపురమును వచ్చెదము.

ఈ మాటలు వినిన సుయోధనుఁడు సపరివారుఁడై పాండవుల వెంట నిడికొని సభా భవనమునకు వచ్చెను. ధర్మజుఁ డా భవనము యొక్క యందమున కంతరంగమున నాశ్చర్యము నొందెను. అది సుధర్మతో సాటియగునది యని మెచ్చుకొనెను. ఇట్టి భవనముగల సుయోధనుని వైభవమును మిగులఁ గొనియాడెను.

ఇట్లాతఁ డాసభాభవనము కలయఁజూచి వచ్చియచ్చటి యాసనమున నాసీనుఁడయ్యెను. సోదరులును అతని ప్రక్కనఁ గూర్చుండిరి. సుయోధనుఁడు వారి యెదుటి వైపున నాసనమున నాసీనుఁ డయ్యెను. కర్ణ శకుని ప్రభృతులు అతని వెంటఁ గూర్చుండిరి. ఇంక ననేకు లాభవనమును జూచుటకై వచ్చిన వారు ఉచితాసనముల నధిష్ఠించి యుండిరి. అప్పుడు సుయోధనుఁడు ధర్మరాజును గాంచి;

సుయోధన:— అన్నా! మన మిచ్చట ఇంచుక ప్రొద్దు పోవుటకై అక్షరక్రీడ సలుపుదము.

ఈ మాటలు వినిన ధర్మరాజిట్లు తలఁపఁ జొచ్చెను.

"ఆటయుండలి తమక మొకవైపున నన్ను ప్రేరేపించు చున్నది గాని అది యక్రమమగుట నామానసము మాత్రము

దాని కంగీకరింపక యున్నది. వలదని వారింతమన్నను ఎచ్చట వీని మనసు నొచ్చునోయని యెంచుచున్నాను ఏమి సేయుదును? ఏ యుపాయము చేత వీని నీ ప్రయత్నము నుండి మాన్పువాఁడను? సామవాక్యముల చేతనే యితని సరి కలుపవలయును.

అని యాలోచించి సుయోధనుని గాంచి;

ధర్మరాజు:—తమ్ముఁడా! జూద మాడుట యధర్మకార్యము. అది పాపమున కారకమగునది. క్షేమము గోరువారెవరును ద్యూతక్రీడకుఁ గడఁగరు. మహాత్ములు సప్తవ్యసనముల కెడగలుగ వర్తింతురు. వీని మూలమున యర్థధర్మములు నశించును.

ఇది విని బదులేమి చెప్పుటకును దోఁచక సుయోధనుఁ డూరకుండెను. సమీపమున నుండిన శకుని ధర్మరాజుఁ గాంచి;

శకుని:—ద్యూతకలా కుశలుఁడు లోకానుభవజ్ఞుఁడగును. దీని బుద్ధి వైశద్యము గలుగుటచే విఖ్యాతుఁడగును. రాజనీతి దెలిసినవాఁ డెవ్వఁడును దీని దూషింపఁడు. జూద మాడుటకు పిలిచినచో నేనాడఁజాలనని నిన్నిట నిర్బంధించు వారెవరు?

ధర్మరాజు:—ధర్మద్యూత మార్యసమ్మతము గాని మాయాజూదము పాపమునకుఁ గారణము. కాఁబట్టి ఇది తగ దని యాడితిని.

శకుని:—ఇది ధర్మద్యూతము యగును.

ధర్మరాజు:—అట్లే నామాటకు సమ్మతించితిని.

అంతట క్రీడోపకరణములు సిద్ధపఱుపఁబడియెను. అక్షఫలకమున కిరుపంకల నాడువారు పరస్పరాభిముఖులై యాసీనులగుట కనువుగా ఆసనములు వేయఁబడెను. ధర్మరాజు వానిలో నొకదానియం దాసీనుఁడయ్యెను. సభాసదు లడిగని ఈలాగునఁ దలఁచిరి.

"ఔరా! ఏమి యీకాల వైపరీత్యము! ధర్మాత్ముఁడగు నీతఁడిట్టి యక్రమ ప్రవర్తనమునకు సాహసించెఁగా! ద్యూతానభిజ్ఞుఁడు ఎట్లు గెలుపొందఁగలఁడు? జూదమునఁగల యాన ఇతని కిట్టియక్రమమునకుఁ బాల్పడు లాగునఁ జేయుచున్నది. తప్పక ఈతఁ డోడఁగలఁడు. దీనఁ బెక్కుకష్టములకు గుఱికాఁగలఁడు. వలదని వారింత మన్నను మన మాట వినఁడని తోఁచెడిని. వయోవృద్ధులును, జ్ఞానవృద్ధులునగు పెక్కురుండునట్టి యీసభలో ఈలాగున నిర్భయముగా ఆడుట కుపక్రమించుట కెంతటి సాహస ముండవలయును! ఇట్టి తెగుదారి తనమునకుఁ గడఁగినవాఁ డేలాగున ఒరుల హితము వినఁగలఁడు? తెలిసి తెలిసి ఇట్టియనుచితకార్య మాచరించిన, దోష మీతనిపైనఁ గదా నిలుచును? ఒరులకు వేన వేలు ధర్మము లుపదేశించు వాని కిది పాపావహమని ఏల తెలియకుండును? చేటుకాలము దాపించినవాఁడు ఇది తగదని యెట్లు పీడఁగలఁడు?"

అని యా సభలోనివారు తలఁచుచుండిరి. ఆసనాసీనుఁడగు ధర్మరాజు సుయోధనుని గాంచి;

ధర్మరాజు:—సుయోధనా! ఇంక నాడుటకుఁ దొడఁగ వచ్చును గదా! ఏల యాలసించెదవు?

సుయోధన:—నాకు బదులు నామామ యాడఁగలఁడు.

అని తన యాభరణముల పీడ్చి పందెమునకై క్రింద నునిచెను. ధర్మరాజు కాలోపహతుఁడు కాఁబట్టి యొకనికై వేఱొకఁ డాడుట యుక్తమా యనుట యాలోచింపక తన యాభరణములఁ దీసి యెదురొడ్డెను. ఆపల వారిరువు రాట కుపక్రమించిరి. ధర్మజున కపజయము గలుగఁ జొచ్చెను. ఓటు కొలఁదియును ఆతనికి మత్సర బాధిక మగుటచేఁ క్రమముగ ధన, కనక, వస్తు, వాహనాదుల తోడి రాజ్యమెల్ల నోడెను. తన సోదరుల నొడ్డి యోటమి గాంచెను. తన్నొడ్డి పరాజితుఁ డయ్యెను. తుదకు ద్రౌపదిఁ గూడ నొడ్డి ఓడిపోయెను. ఇంక నొడ్డుట కేమియు లేనందున విషాదము నొందెను. సభాసదులు ఇది గని మిక్కిలి చింతించిరి.

## ఓదార్పు

"రాజేంద్రా! నీకుమారుఁ డతిక్రూరుఁడై జూదమునఁ బాండవుల నోడించెను. ద్రౌపదిని సభామధ్యమునకుఁ బిలిపించెను. భీముఁ డా యవమతిచేఁ గోపించి నీకుమారుల సంహరింతు నని శపథము గావించెను. ఇంక నీసుతులకు వినాశకాలము సమీపించె నని తలఁచుచున్నాను."

అని యిటు విదురుఁడాడిన పలుకులు విని ధృతరాష్ట్రుఁ డిట్లు తలపోయఁ దొడఁగెను.

"ఆహా! చెట్టు చెడు కాలమునకుఁ గుక్కమూతిపిందె జనించు ననుట నిక్కమయెను. వీని మూలమున నావంశ మంతరించులాగునఁ దోఁచెడిని. ఆదినుండియు విదురుని హితము వినకుండినందులకుఁ దగిన శాస్తియాయెను. వీని చెలులయిన వారికిఁ ద్రివ్వదమనినఁ గర్ణాది దుర్మంత్రులు చేరి సన్మార్గమునఁ బడనీక చెఱచుచున్నారు. మొట్టమొదటనే వీనినిఁ దారికిఁ దేవలసి యుండెను. అప్పుడెల్లఁ బుత్త్రప్రీతిచే విచ్చలవిడిగా విడుచుటచే నేఁడిట్టి యక్రమప్రవర్తనకుఁ గడఁగెను. దోషము నాపైఁగలుగ నొరుల దూషింపనేల? ఇప్పుడైన విదురునితో సంప్రతించి వాని యభిప్రాయము చొప్పున నడచికొలు మేలగును"

అని వితర్కించి చెంతనుండు విదురునితో నిట్లనెను.

"విదురా! నాఁటినుండి నీమాటలు వినకుండినందునఁ గదా ఇంతలు పుట్టెను! ఇఁక నేఁటి యాపద గడచుటెట్లు? ఏలాగునఁ బాండవుల క్రోధమును శాంతింపఁ జేయవచ్చును? పతితిలకమగు యాజ్ఞసేనిని ఎట్లు ప్రసన్నురాలిం గావింపనగును? ఇందులకుం దగు నుపాయము చెప్ప వలంతివి."

"రాజేంద్రా! ఇప్పటికైనఁ బాండవుల రావించి వారి రాజ్యము మఱల వారి కిప్పింపుము. అంత వారపగతక్రోధు లగుదురు. అట్లైన నీసంతతికి గీడు కలుగకుండఁ గలదు."

విదురుని యీ హితోపదేశము వినిన ధృతరాష్ట్రుఁడు ద్రౌపదీ సమేతులగు పాండవులను దనచెంతకు రావించి;

"ధర్మాత్ములారా! జూదమువలన మీకు లవడిన దాస్యవృత్తినుండి మిమ్ముఁ దొలఁగించితిని. మీ రాజ్యమును మీ కిచ్చుచున్నాను. నాకొడుకు నేరమి నాచరించిన యీ నేరమును క్షమించి వానియెడఁ బ్రసన్నులుగండు. మీరింద్రప్రస్థమున కరిగి యథాపూర్వము రాజ్యము పాలించుచు సుఖముగా నుండుడది— ద్రౌపదీ! లోకులు తాము చేసిన సుకృత దుష్కృతముల మూలమున సుఖదుఃఖము లనుభవించుచుందురు. సంసారము ద్వంద్వసహిత మనుట నీ వెఱుఁగనిది కాదు. పరతంత్రమగు నీసంసారమును సూత్రధారుఁడు బొమ్మల నాడించు లాగున ఈశ్వరుఁ డాడించుచున్న వాఁడు. జనులాతని చేతి కీలుబొమ్మలయి మెలఁగుచున్నారు. కాఁబట్టి భంగపఱచువా రెవరు? భంగపడువా రెవరు? ఇది తెలిసిన నీయట్టి వారాగ్రహము సెందరనుట నిక్కము."

ధృతరాష్ట్రుని యీ సాంత్వవచనముల మూలమున ద్రౌపదీ భీమార్జునులు దక్కఁ దక్కినవారు శాంత క్రోధు లయిరి. వారి కాగ్రహము తగ్గకుండినను ధర్మసుతుని యాజ్ఞ కెదురాడలేనివా రగుటచే మంత్రబద్ధములగు సర్పములవలె ఏమియు బదులాడక యూరక యుండిరి. అంత రాజు వారిని కథారూఢులఁ గావించి యింద్రప్రస్థమున కంపెను.

# అరణ్యగమనము

పాండవులఁ గారవించి రాజనుపిన పిమ్మట సుయోధ నుఁడు శకుని మున్నగువారిని బిలిచి యిట్లనెను.

సుయోధనః— తెలియునే మాతండ్రిచేసినపని! పాండవుల రావించి వారిరాజ్యము వారికొసఁగి మఱల ఇంద్ర ప్రస్థమున కంపెను! శత్రువులఁ బరాభూతులఁ గావించి పిదప వారిని గారవించిన మాత్రమున శాత్రవము మానునే? తిరిచూచి వారు మనల హింసింపకయుందురే? దెబ్బదినిన పాము దప్పించుకొని కలుగులో దూరినంత మాత్రాన అది వెడలెను గదాయని సంతోషింపవచ్చునే? పగపట్టి మనలఁ గాటువైవక విడుచునా? ఇతఁ డాచరించిన కార్యము మనకు మేలుగాదు. విదురుని మాటవిని ఈలాగునఁజేసెను. అతఁడు పక్షపాతియగుట తెలిసియును అతనితోడనే మఱల మఱల ఆలోచించు చుండును. నేనేదే నననఁ "దండ్రీ! నీకేల వారలతోడి వైరము? ఇంక నైనఅన్యులమాట వినకవారలతో మైత్రి గావింపు" మనును.

శకుని:— నీవేఁగి నీతండ్రితో మఱల వారిని బిలువనంపు మని వేడుకొనుము.

సుయోధనః— నే నింతకుమున్నరిగి యుంటిని. మా తండ్రితో వారిని బుద్ధ్యాగముకొఱకుఁ బిలువనంపుమని చెప్పితిని. మొట్టమొదట అతఁడు వారిఁ బిలువ నంపుట కంగీకరింపఁ డాయెను. తాను రాజ్యమునొసంగి మఱల వారి రాజ్య మపహరించుటకుఁ గారకుఁడు గారాదని నా మాట నిరాకరించెను. అపవాద పాత్రుఁడ నగుదును గాన నీవని

చేయుననెను. ఆవల నేను, వారిం గొంత కాలము దేశము నుండి వెడలఁగొట్టుదు నంతియు కాని రాజ్యము నపహరింప ననియుఁ, దిరుగ వారు వచ్చులోపలనే యీ ధనములుల మగుదుమనియును యెంతయో బోధించినంత నా మాట కెదురాడలేక యొప్పుకొనెను. వారిని బిలుచుకొనిరాఁ బ్రాతి గామిని బంపియున్నాఁడను. వారిప్పుడు తిరిగి యిచ్చటికి వచ్చు చుందురనియే భావించెదను.

అటఁ బాండవులు ధృతరాష్ట్రునానతిఁ జొప్పున మఱలి వచ్చుచుండిరి. ధర్మరాజు నిష్కపట స్వభావుఁడగుటచే మగుడఁ దండ్రిని సోదరులను జూడవచ్చును గదా యని సంతోషించుచు వచ్చుచుండెను. భీమార్జునులు మాత్రము రాజీలాగునఁ బిలిపించుట యేదేనొక కపటకృత్య మాచ రించుటకే యని నిశ్చయించిరి. మఱల వారలు దమప్రతినలు సఫలములు గావచ్చును గదా యని యించుక సంతోషము నొందిరి.

పాండవులు మగిడి హస్తినకువచ్చి చేరిరి. యథావిధి సభామండపమునకు రాఁగనే శకుని వారిఁగాంచి యిట్లనెను.

శకుని:—ధర్మసుతా! పునర్ద్యూతమునకై మిమ్మిప్పుడు రాజు రావించియున్నాఁడు. ఇందు మీరాజ్యమును బందెముగా నొడ్డుట సరికాదు. యేలన? రాజేంద్రుఁడు మఱల మీకు రాజ్యమిచ్చి యుండుటచే దాని నొడ్డుట యయుక్తము. అట్టి పందెమున కేమిచ్చగింపము. ఇంక నెద్దే నొకపణ మొనరింప వలయును గదా? దేనినొడ్డఁ దలఁచి యున్నారు?

ధర్మరాజు:— అట్టి దెద్దియో యుండిన నీవే తెలుపుము.

శకుని:— ఇప్పు డెవ్వరోడినను పండ్రెండేండ్లు లరణ్య వాసము సలుపవలయును. పదమూఁడవయేట నెద్దెనొక జనపదమున కరిగి యజ్ఞాతవాస మొనర్పవలయును. ఈ పందెమున కిష్టపడితివేని యుద్యూత మాడఁగడఁగుము.

ధర్మరాజు విధిప్రేరణచే ఆ పందెమున కంగీకరించెను. యథాపూర్వ మపజయ మందెను. అంతఁ బాండవులాభరణాదుల వీడి, వల్కలాజినముల ధరించిరి. ద్రౌపదితోడ నచ్చటి గురుజనములకు నమస్కరించి, వారి యనుమతి వడిసిరి. అటనుండి కదలి కుంతీదేవియొద్దకు వచ్చిరి.

ఆబిడతో జరిగిన విషయమెల్లఁ జెప్పి ఆమెను విదురుని యింట నుండవలయుననిరి ఆమెయు నెంతయు విషాదమంది;

కుంతి:— సుతులారా! నేఁటివఱకు మిము వీడక ఎట్లో భర్తృమరణ వ్యసనమును మానసమున నణఁచికొని యుంటిని. ఇంక నొంటరినై యిట నుండుట కెట్లోర్తును? అట్లని మీతో నరుదెంచి మీకుఁ గష్టము లీయ నెంచుటలేదు. విదురుఁడు ధర్మాత్ముఁడు. అతఁడు పరోపకార పారీణుఁడు. మహాభాగుఁడగు నాతనియింట నుండుటకు నేనంగీకరించెదను. కష్టములు గడచివచ్చి నన్ను మఱల మీరాదరింపఁ గలరు. ధర్మము మీకు జయమొసఁగును గాక. సత్యము మీకు శుభము లిచ్చును గాక.

ఇట్లు తల్లివలన నాశీర్వాదములను బడసిన పాండవులు హస్తినవదలి యరణ్యమున వసింప నరిగిరి.

9]

# రహస్యాలోచన

పాండురాజసుతు లడవిని నానావిధ కష్టములుపడయుచుండిరి. సుయోధనుఁడు దనచారుల మూలమున వారి యప్పటప్పటి స్థితి నరయుచుండెను. అరణ్యము నందలి క్లేశములను సహింపలేక వారు నిశ్చింతులై యుండుట దెలిసి యాతని కంతస్తాపము గలిగెను. అభిమానియగు వీరుఁడు తన విరోధి యొక్క వైభవముచూచి యోర్వకుండుట సహజమే కదా! సుయోధనుఁడు పాండవు లిడుములు గుడువవలయునని తలఁచి వారిని గానలపాలు గావించెను. వారి కప్పటి పాటులు దుఃఖకరములు గానప్పుడతని యుద్దేశము వ్యర్థ మగుట లేదా? అలాగునఁ దన యభిమతము సార్థకము గానందునఁ జింతాక్రాంతుడై యుండెను. అప్పుడప్పుడు విదురుని బోధన వినిన ధృతరాష్ట్రుఁడు పాండవులఁ బొగడుచుండుట ఈ వ్యసన మును మఱింత యతిశయింపఁ జేయుచుండెను. అంత నొకనాఁ డతఁడు దన యనుజ వర్గముతోడను, కర్ణాది మిత్రవర్గము తోడను గూడి రహస్యాలోచన, మొనర్పఁదొడఁగెను.

సుయోధనః—మామా! మాతండ్రి యేల ఇంతటి వెఱ్ఱివాఁడయ్యెను? భీముని తేజము చెప్పనలవి కానిదఁట. వాఁడు అన్న మాటల జవదాఁటఁడఁట, అర్జునుఁడు గడు బలవంతుఁడఁట. ఈ భూమండలమంతయును అతనికిఁ లోఁబడి యుండవలసినదఁట. రాత్రి నశించినంతఁ బగలును, బగటి కావల రేయియు వచ్చులాగునఁ గొంతకాలము సుఖ మనుభవించితిమి గావున మనకు దుఃఖములు రానున్నవఁట.

పాండవులపైఁ గల యభిమాన మతనిని ఈలాగునఁ బలికించు చున్నది. తండ్రియగుటచే గౌరవార్హుఁడగు నాతని మాటల కెదురాడలేక అతఁ డేమి సెప్పినను వినుచు నూరకున్నాను.

శకుని:—వృద్ధుఁడగుటచే నీతండ్రి మతిసెడి ఇట్లు పలుకు చున్నాఁడు. అతనిమాటల మన మేల లక్ష్యము సేయవలయును?

సుయోధన:—నన్ను పెంచిన యాతనిమాటల గౌరవ ముంచవలయును గాదే! కాఁబట్టి అతని పలుకుల యం దనాదరము చూపఁదగదు. అతఁడు మాత్రము నామాటల నిరాకరించుచున్నాఁడా? పాండవ పక్షపాత మవ్వాడవ్వారు తలచూపుచుండినను మనయెడ నభిమానము వీడకున్నాఁడు గదా?

కర్ణ:—నీమాటలు నాకు నచ్చుచున్నవి. నిక్కముగ నీయెడ నాతనికిఁ బ్రీతియుండిన నీతండ్రి పాండవులఁబొగడునా? ఇంక నీవిట్లజ్ఞానమునఁ బడకుము. నామాటల వినుము. మహారాజవైతివి. రాజరాజ బిరుదము నంది వెలయుచుంటివి. పౌరజానపదులు నీక్షేమమునే కోరుచున్నారు. కాఁబట్టి నీయిచ్చ చొప్పుననే కార్యములనెల్ల జరుపవలయును.

దుశ్శాసన:—అంతియు సమంజసముగనే యున్నది. గాని శత్రుశేష మింకను అట్లే నిలిపియుంచుట సరికాదు. వారిప్పు డగతికులై కానలఁబడి గాసిసెందుచున్నారు. వారిని సమూలముగా ఛేదించుటకు ఇదియే తగిన తరుణము.

అనువింద:—గుప్త మార్గమున వారిఁ గడతేర్చుటుచితము.

కర్ణ:—శౌర్యవంతుఁ డెవ్వటికిని ఇట్టి కార్యమునకుఁ గడఁగడు. శత్రువుల నెదిర్చి గెలుచుటయు పౌరుషమగును.

శకుని:— విషమునకు విషమే యౌషధమగునట యెఱుఁగవా? వంచకులయెడ వంచనయే ప్రయోగింపఁదగినది.

వికర్ణ:—మీవలె వారు వంచకులు గారు.

శకుని:— ఓరీ! పసివాఁడవు నీకేమి దెలియును? రాజునెడల నతివినయము చూపుచుఁ, బ్రజలయెడ నత్యాంతాదరము చూపుచు వారుండినచో రాజ్యమాక్రమింపఁ దలఁచియే యగును. అది వంచన కాదా? శత్రువులు మరణించిరని తలఁచి మనము నిర్భయులై యుండవలయునని యెంచి లాక్షాగృహము వారు దహించి యరిగినది కపట కృత్యము గాదే? బ్రాహ్మణవేషమున వచ్చి ద్రౌపదిని బరిగ్రహించినది మాయాకార్యమే కదా? నాఁడు జరాసంధు నొద్దకు బ్రాహ్మణవేషమున నరిగి యుద్ధభిక్ష మడిగినది సత్యప్రవర్తనము కాఁబోలు? ఇట్టి వారిని మనము హింసించిన దోషమేమి?

సుయోధన:— ఎల్లప్పుడును హింసాపరత్వము కాని మీ కన్యచింత గాన్పింపదు. మీ రాచరించిన ప్రయత్నమెద్ది కొనసాగెను? నాఁడు వలదనిన వినక భీముని సంహరింప యత్నించితిరి. ఏమాత్రము ఫలించెను? లాక్షాగృహదహనమునకు నన్ను బురికొల్పితిరి? దానివలని యపవాదము నే నపనిందల పాలగుటయే కదా? జూదమాడి

వారిని వెడల నడచితిరి ? దానివలనఁ బ్రయోజనమేమి గల్గెను ? వారింతకైన నరణ్యవాసక్లేశమునకుఁ జలింపరైరిగా!

శకుని:—సుయోధనా! నామాటవిని జూదమాడుటచేఁ గదా యిప్పుడు నిస్సపత్నుఁడుగ రాజ్యమేలుచున్నావు ? వారి మెడ నీకంతటి యనుగ్రహముండిన వారినిఁ బిలిపించి మఱల వారికి రాజ్యమిమ్ము. కాదని యడ్డుపడువా రెవరు ?

సుయోధన:— గతమును గుఱించి కదా వచించితిని ?

వికర్ణ:— మనమిప్పుడు రాజ్యము నిచ్చెద మనినను వారు ప్రతిజ్ఞాభంగము గావింపరు.

సుయోధన:— మన మాచరించినది యక్రమకార్య మనియు, దాన లాభము లేకపోయెననియుఁ గదా వచించితిని?

కర్ణ:— నీ తండ్రికిఁ బాండవులమీఁద పక్షపాతము మెండుగ కదా పలికితివి ? నీకీ ధర్మాభాసచింత తలచుగఁ గలుగుట కేమి కారణము ? రాజులకు శాత్రవహనన మధర్మము కాదు. నాఁడు నేఁజెప్పినపుడే యుద్ధమున నాక్రమించి యుండినచో ఈవఱకే వారుండినచోటఁ బూరి మొలిచి యుండును గదా ?

సుయోధన:— మన కవమానము గలిగించిన వారికిఁ బ్రతిగా మనము గర్వభంగము గావింప వలయుననుట యొక్కటియే యాదినుండి నాయుద్దేశము. ఒకరిని హింసించుట నా యభిమతముగాదు. శత్రువు చచ్చిన వానియెడఁ దిరుగఁ బగ సాధింపఁ గలమా ? జీవముతో నుంచి వానిని దఱుచుగ దుఃఖాక్రాంతుని గావించుట కదా సంతోషదాయకము?

కర్ణ:— నీకట్టి యుద్దేశముండిన నా మాట చొప్పున నాచరింపుము. పాండవు లిప్పుడు ద్వైతవన సరోవరము చెంత నున్నారని కదా మనచారులు వచించి యుండిరి? గంభీర స్వభావులగుటచేఁ దమదుఃఖము బైకిఁజూపకున్నను మానస మునఁ జింత యుండదని తలఁచితివే? నీ విపుడు సామ్రాజ్య వైభవముతోడ వారున్న యెడ కరుగవలయును. గోరుచుట్టుపై రోఁకటిపోటు దగిలిన లాగున ఇదివఱకే దుఃఖితులగువారు నీ వైభవము చూచి మఱింత దుఃఖావఁగలరు.

సుయోధన:— నేఁ దలచినదియు నదియే యగును. మిత్రజనులకు సంతోష మొదవించులాగున, శత్రుజనులకు దుఃఖము కలిగించుట కదా సంపద గలిగియుండుట వలని ప్రయోజనము? మనమచ్చటికరుగుటకు మా తండ్రి సెల వీయఁ డేమోయని తలఁచెదను.

కర్ణ:— ధైర్యసాహస సంపన్నునకుఁ గాని సంపద నిలువఁ జాలదు. మహారాజవగు నీ వా ముదుసలి యానతి కేల ఎదురు చూడవలయును?

సుయోధన:— మా తండ్రి యనుమతి లేనిది నే నే కార్యము నాచరింప సాహసింపను.

కర్ణ:— నీవు నిక్కముగ నీ జనకు నానతి దాఁట వాఁడవైనచో ఆతఁడాజ్ఞ యిచ్చుట కేదే నొక యుపాయ మాచరింపవలయును?

వికర్ణ:— ఇంతదాఁక పాండవులు వంచకులని యీ శకుని నుడివెనుగదా? మాతండ్రి నమ్మించుట కేదేని కుయుక్తి గావించుట మాత్రము వంచనగాదే?

శకుని:— ఇది వంచన యెట్లగు? రాజులోనర్పు తంత్రములలో నిది యొకటి. సుయోధనా! వేఁటకు వెడలు నెపమున తండ్రిగారి యానతి గొనుము.

కర్ణ:—పాండవులు ద్వైతవనమున నున్నారనుట యాతఁడెఱుఁగును. కాఁబట్టి వేఁట కేఁగవలయు నన్నను అతఁడా వైపునకుఁ బోవలదనియే చెప్పఁగలఁడు. ద్వైతవన ప్రాంతమున మనకు గోవులు విశేషించి యున్నవి. వానిఁజూడఁ బోవలయు నని నన ఆజ్ఞ యీఁగలఁడు.

శకుని:— గోవులఁజూడ నిప్పుడే మనసరమని చెప్పి మన మాటను త్రోసి పుచ్చవచ్చును.

కర్ణ:— మిత్రమా! సమంగనామధేయుఁడగు గోపాలుఁ డొక్కఁడు గలఁడు. వాఁడు మనమెట్లు చెప్పిన నాలాగునఁ బలుకఁగలఁడు. "ద్వైతవనమునందలి పశువులు దుష్టమృగబాధితములై నశించుచున్నవి. కాఁబట్టి క్రూరమృగ నాశనమునకుఁగా మీకుమారుఁడు సుయోధను పంపవలయు" నని వాని ముఖమునఁ జెప్పింతము. అప్పు డాతఁడు తప్పక నిన్ను బొమ్మని యాజ్ఞ సేయఁగలఁడు?

సుయోధన:— నీ యూహ కడు మెచ్చఁదగినది. రేపు ఉదయముననే ఆ ప్రయత్నము చేసెదము.

అని యటనుండికదలి యందఱును వారివారియిండ్లకేగిరి.

# ఘోషయాత్ర

ధృతరాష్ట్రు ననుమతిని సుయోధనుఁడు ఘోషయాత్ర వెడల నెంచెను. బ్రాహ్మణులకు యాత్రాదానము సేసెను. పురోహితులు పుణ్యాహ జలముల నాతనిపైఁ బ్రోక్షించి యనేక శాశీర్వాదములు గావించిరి. పుణ్యాంగనలు సేసలు చల్లిరి.

అంత జ్యోతిషికోద్దిష్టమగు శుభ ముహూర్తమున సుయోధనుఁడు వెడలెను. ముందుఁ దూర్య ధ్వానములు సల్పుచుఁ గొంద ఱరుగుచుండిరి. వారి వెనుకఁ జతురంగ బలములు గదలుచుండినవి. వానిపిఱుంద జయజయధ్వానములు సేయుచు, బిరుదావళిఁ బాడుచు వందిమాగధ జనులు నడుచుచుండిరి. పిమ్మట సుయోధనుఁడు రథారూఢుఁడై చనుచుండెను. వాని వెనుక నతని సోదరులును, కర్ణాది మిత్రులును నరుగుచుండిరి. ఆవల నంతఃపుర నారీవర్గము శిబికల యందెక్కి- పరిచారికాజనము చుట్టుముట్టి వచ్చుచుండ నేఁగుచుండెను. వారి కావల మఱలఁ జతురంగ బలము వచ్చుచుండెను.

ఇట్లఖండవైభవముతోడ సుయోధనుఁడు పురమునుండి బయలువెడలెను. మార్గమున ననేకారణ్యములఁ దాఁటెను. పెక్కునదుల నుత్తరించెను. ఘోషము లుండు స్థలమునకుఁ జేరెను. రాజరాజురాకకు మిక్కిలి యులరిన గోపకులెల్ల రచ్చటికి వచ్చి యాతనిఁగాంచి;

"స్వామీ! మహారాజ సందర్శన మబ్బిన యీదినము గదా! మాకు సుదినము! దేవరవారి రాకవలన మేమకాక

మా పశువులు నెంతయు సంతసమందుచున్నవి. అదె యావెల్ల కోడె బసవఁడను పేరఁబరఁగినది. మిము నందర్శించి యుత్సాహమున నత్తిత్తి అంకవేయ గమకించు చున్నది చూఁడుఁడు. అల్లదె కత్తెమాఁద కృష్ణాంగ మనునది. తన నేత్ర పుటముల మీ ముఖ సౌందర్యామృతము గ్రోలుచున్నది వీక్షించితిరే? ఈ కపిలవన్నె యావు నందినీ నామకము. మిముఁ జూడఁ గలుగుటచే ద్విగుణితోత్సాహముతో నిశ్చలమై నిలిచి యున్నది.

సుయోధన:— గోపకులారా! మీ రాజభక్తి మిక్కిలి మెచ్చఁదగినది. మీకును మీ పశుగణమునకును కుశలమా?

గోపా:— దేవరవారు రాజ్యమేలుచుండ నేరికిఁగాని కుశలమునకేమి కొదువ! మీ యనుగ్రహమున జలసమృద్ధియుఁ, దృణసమృద్ధియుఁ గలిగియుండెను. ఇంతకంటె మాకేమి కావలయును? పశువులు గడుపారమేసి మంచినీరు ద్రావి నెమరు వేయుచుండఁజూచుచుండు మా యదృష్టము మీకటాక్షమునఁ గలిగినదే!

సుయోధన:— మేము ఇచ్చటి పాలము గలయఁజూడ నెంచుచున్నాము.

గోపాల:— దేవరచిత్తము.

అని యాతనిం దోడ్కొని చనుచు;

గోపాల:— సార్వభౌమా! ఈ యెదుటఁ గనుపడు నాగుడిసె మా మందరునిది. వాఁడె గూడెమునకెల్ల మేటియగు వాఁడు. అతఁ డొకనాఁడు ఇచ్చటికి దాపుననుండు ఘోరా

రణ్యమున వేటాడుటకై యరిగెను. ఒక్కపులి వచ్చి వానిపైఁ బడ నుంకించెను. వాఁడు దాని మూఁడు బాణముల సంహరించెను.

సుయోధనః—అతఁడిప్పుడెచ్చట నున్నాఁడు?

గోపాలః—వాఁడిప్పుడు గిరివ్రజమున కరిగి యున్నాఁడు. ఆ తాటియాకుల గుడిసె మాసంగునిది. అతఁడెట్టి దుష్టపశువు నైనను ఒక్కనిమిషములోఁ దనవశము గావించుకొనఁ గలఁడు. తూర్పువైపునఁ గాన్పించు నాపెదరుపాక మానందునిది. వాఁడు మా వ్రజములోని పశువైద్యుఁడు.

సుయోధనః— మీకిట జీవన మెట్లు జరుగుచున్నది?

గోపాలః—అల్లదె యుత్తరపు వైపునఁ గనపించు పొలమున నీవార ధాన్యము పండుచున్నది. అదియే మాజీవనమున కాధారము.

సుయోధనః—ఆపొలములోని ధాన్యమును మీరు గ్రహించుకొని పోవుటకుగా మా కెంతపన్ను చెల్లించుచున్నారు.

గోపాలః—పంటలోని షష్ఠాంశమును మీకుఁ జెల్లించుచున్నాము.

సుయోధనః—మేము మీ వనమున వేటాడ నెంచుచున్నాము.

గోపాలః—ఇందుఁగల క్రూరమృగము లేరిని హింసించుటలేదు. హింసాకరములగు మృగములను గదా రాజులు వేటనెపమున సంహరించుచున్నారు.

సుయోధన:— క్రూరజంతువు లిప్పుడు హింసింపలేదు గదాయని వానిని సాధువులని యెంచఁబోకుఁడు. జాతికి సహజమగు వాని హింసాగుణము మానఁజాలదు. ఇప్పుడు వాని కచ్చట నేదే నెఱచిక్కుటచే నూరకున్నవి. లేవే మఱల హింసకుఁ గడఁగవచ్చును. కాఁబట్టి రేపు మాయనుచరుల మూలమున ఈ యడవియందుఁగల దుష్టమృగములు నశింపఁ గలవు.

అనియాడి వారలతోడ నటనుండి కదలెను.

## వేఁట

ద్వైతవన ప్రాంతమునఁ బెక్కు క్రూరమృగము లుండెడివి. అచ్చట మహర్షు లనేకులుండుటచే ఎట్టిరాజులును వేఁటాడ వచ్చుటలేదు. తపశ్శీలురగు నాధారుణీ సురుల సహవాసము మూలమున అచ్చటి మృగములు పరస్పరము మైత్రి గలిగి వర్తించుచుండెడివి. ఒక్కెడఁ బసువులు పులులతోడను, సింగపుఁగొదమ లేనుఁగులతోడను జెలులాట సలుపుచుండెను. మఱియొక ప్రదేశమునఁ బిల్లులు నెలుకలును జేరి నీవార ధాన్యము నేరి తినుచుండెను. కాకములు ఘూకముల కెఱ నందించుచుండెను.

అట్టి యడవిని ఒక్కనాఁటి యుదయమున నొక రాజు వేఁటాడవచ్చి యుండెను. రాజును రాజ బంధువులును

వసించుటకుఁ దగుచెంకి యమర్పఁబడెను. రాజభటులుఁ గొండలు వేఁటకువలయు సాధనములఁదీసికొని వచ్చుచుండిరి.

ఇట్లు పరిజనులెల్లరు నా ప్రదేశమునకు వచ్చినంతనే వేఁట యారంభ మయ్యెను. రాజభటు లనేకులు దుష్టమృగ ములసంహరించు చుండిరి. వేఁటగాండ్రతోఁడ వచ్చిన వేఁట కుక్కలు పొదలలోఁ జొచ్చి పెక్కుజంతువులఁ జంపుచుండెను.

రాజు నవక్ర పరాక్రమమున ఆయడవిని గలజంతు జాలములనెల్లఁ గలఁచెను. చెంతవచ్చినవాని ఖడ్గప్రహారమున సంహరించెను. పాఱిపోవువాని బాణములవైచి చంపెను. వీరి వేఁటకతమున ఆయరణ్యమునఁ గల మృగముల సఖ్య స్వల్ప కాలములోననే తగ్గఁ జొచ్చెను.

అంతఁ గొంతవడికి మృగయా పరిశ్రాంతుఁడగు రాజు ద్వైతవన సరోవరతీరమున కరిగి అచ్చటఁగల యొకగున్న మావిసీడ నాసీనుఁడయ్యెను. ఇంతలోనఁ గొందఱు గోపకు లరుదెంచి అమృతముతో సమానమగు నావుపాలు దెచ్చి యిచ్చి త్రాగుమనిరి. వారి వేఁడికోలు చొప్పున నరపాలుఁ డా క్షీరములఁ గ్రోలి తనివిపొందెను. ఇంతలోనఁ జెదరి యుండిన యాతనిభటు లచ్చటికివచ్చి చేరిరి. రాజు దన పరివారమును గాంచి;

"మీ యీనాఁటి వేఁట కడుమెచ్చఁదగినది. మీరెల్లరు మీ కష్టమునకుఁ దగినలాగున బహుమతుల నందవలసి యున్నారు. శిబిరము చేరినవెంటనే యా కార్యము జరుగఁ గలదు."

"దేవా! సేవకులమగు మేము చేసిన యీకార్యము మాధర్మమే గాని మేలుకాదు. మీమెప్పుకోలునకుఁ దగినంత పని యేదియు మేమాచరింపలేదు. ఇట్టి స్వల్ప కార్యమునకా మీరు బహుమతు లొసఁగనున్నారు? మీయభిమానమునందిన మా కదియే పదివేలు?"

"భృత్యధర్మమును బాటించి మీ రిట్లాడుట మీకు సహజమైనను నాయుత్సాహమునకుఁ దగులాగున నే బహూకరించుటయే యుక్తము. నా యిప్పటి యుత్సాహము చొప్పుననైన మిమ్మిప్పుడే గౌరవింపవలసి యుండును. మా వారెల్లరు చూచుచుండ మిమ్మాదరింప వలయునను పట్టుదల యొకటి దాని కడ్డువడుచున్నది. వారింకను రాకుండుటకుఁ గారణము తెలియకున్నది."

"వేటాడ నరిగినవారు రాక యేల తడయుదురు? ఆ మీ జలాశయమునొద్ద నుండుట వారి కెట్లు తెలియఁగలదు? ఈ మచ్చటఁ గాన్పింపమిఁ దిన్నఁగా శిబిరమునొద్దకు వారేఁగి యుందురు?"

"ఔనౌను. మీ యూహ సరియగునదే. మనమింక నిటఁ దడయ రాదు. శిబిరమునొద్దకుఁ బోవుదము. రేపుదయమున నీ జలాశయము నొద్ద నా కొక క్రీడాగృహమును నిర్మింపుము. ఇది వాసయోగ్య మగునది. మన రాచనగరును ఇంతటి సౌఖ్యము నీఁజాలదు."

అని యా రాజు నిజపరివారము తోడను గోపకుల తోడను బటకుటీరములున్న వైపున కరిగెను.

# మాన భంగము

"ఓ రాజభటులారా! ఈ కొలను చిత్రసేనుఁడను గంధర్వ రాజునకుఁ గ్రీడార్థముగాఁ గల్పింపఁబడినది. కాఁబట్టి మీ రీ ప్రదేశమునుండి తొలఁగిపొండు. లేకున్నఁ గష్టముల పాలగుదురు."

"ఓ వికృతాకారులారా! రారాజగు సుయోధన మహారాజీ ప్రదేశమున కెల్ల నధికారి యనట దెలియదా? మే మాతని భటులము. మీరు నుడివిన చిత్రసేనుఁ డెవ్వఁడగు నదియు మాకుఁ దెలియదు. అట్టి యప్రసిద్ధుని కొఱకా ఈ కొలను నిర్మింపఁ బడెను? చాలు చాలు మీ పలుకు లిఁక నూరకుండుఁడు. నలువురువిన్న నవ్విపోవుదురను లజ్జ యించుక యును లేక, రాజు వినిన దండించు ననుభీతి సుంతైన లేక, ఏల యీ లాగునఁ బ్రేలెదరు? మాఱు మాటాడక మీ రిచ్చటినుండి చప్పున వెడలిపొండు."

"ఎదుటి కొలఁదియుఁ, దనకొలఁదియుఁ దెలియక త్రుళ్లిపడుచుండు మీ రాజును వెంటనే యిటనుండి పాఱి పొమ్మని చెప్పుఁడు. లేకున్నఁ దగిన శాస్తి జరుగఁగలదు."

ఈ మాట లాలకించిన సుయోధనుని భటు లించుక చకితహృదయులై ఇట్లాలోచింపఁ దొడఁగిరి.

"రారాజగు మనరాజును దిరస్కరించి యాడుచుండు వీరెంతటి బలవంతు లగుదురో? భటులే యింతటి ధైర్యవంతు లగునపుడు యజమానుఁ డెంతటి బలవంతుఁడుగా నుండ నోపును? ఇట్టివారితోఁ గలహము పెంచికోలు సరికాదు.

మనరాజు ఈప్రయత్నము మానుకొనుట సరియగునా. అతనిని ఇట్టి కార్యము నకుఁ గడంగ వలదనుటకు మన మెవ్వరము? భృత్యుఁడా స్వామి నాక్షేపించుట? అట్లని యూర కుండినఁ బ్రభువునకు సంకటము గల్గిన తరుణమున తత్త్వ మెఱిఁగి పలుచకుండు సేవకుఁడపరాధి యగును గదా! కాఁబట్టి మన మిచ్చట జరిగినవానిని బూసగ్రుచ్చినలాగున వివరింతము. ఆపల నాతని చిత్తము. వడ్లతోడఁ దట్టయు నెండులాగున రాజున కెద్దే సిక్కట్టు గలిగిన అతనితోఁబాటు మనమును అనుభవింప వలసినదియే న్యాయము.''

అని తలపోసి సుయోధనుని పాలికరిగిరి. గంధర్వుల కును దమకును జరిగిన సంభాషణమును సాంతముగ విన్న వించిరి. సుయోధనుఁడు వీరి మాటలు విని రోషావేశ పర వశుఁడై;

సుయోధన:— కర్ణా! వింటివే వీరిమాటలు! గంధర్వు లఁట. వారి యానతి చొప్పున మన మీయరణ్యమును వీడి యేఁగవలయునఁట. లేకున్నఁ దగిన శాస్తి సేయువారఁట. ఇదేటి మాట? అజేయులని వాసిగాంచిన మనమేడ? దేవదాసులకు నాట్యము గఱపు వారేడ? ఇందుకే సంతర మెఱుఁగక ఇట్లు చెప్పికంపుట వారి వినాశమునకే కారణమగును. ఆహా! నక్క సింహమును మార్కొనఁ దలఁచినలాగున నున్నది. ఇట్టి నీచుల నిఁక నూరక విడువరాదు. దుశ్శాసనా! వెంటనే సేనల నాయత్తపఱచునది. కర్ణా! నీవును సన్నద్ధుఁడ వగుము. మామా! మీరును మాతోడ వచ్చెదరుగదా?

దుశ్శాసన:— కుక్కనుగొట్ట బచ్చనకోల గావలయునా? ఆ నీచుల సంహరించుట కింత సన్నాహమేల? ఇదె నాకానతిచ్చిన తెప్పపాటు కాలములోన వారి నెల్లర నిహతము గావించెదను.

వికర్ణ:— అన్నా! తొందఱ పాటెప్పటికిని బనికిరాదు. అర్జునుఁ డింద్రపుత్త్రుఁడు గదా? ఇంద్రుఁడు మన యుద్దేశ మెఱిఁగి మనల భంగపఱుప వీని బంపి యుండునేమో? ఇంద్ర పాలితున కెంతటి బలముండునో యూహింపుము.

అనువిందుఁడు:— నాకుఁ జూడ నిది యింద్రకార్యమని తోఁచుటలేదు. అర్జునుఁ డింతకుమున్ను స్వర్గమునకు వెళ్ళి యుండెనఁట కాదా? అప్పుడీతనితో స్నేహ మలవడి యుండవచ్చును. మన మిచ్చటికి వచ్చుట దెలిసి మిత్త్రప్రీతిచే మనతోఁ గలియఁబడ నెంచి యీతఁడు దన భటులతోడ వచ్చి యుండునని తోఁచెడిని.

వికర్ణ:— ఎట్లును నీతఁ డజేయుఁడని నాకుఁ దోఁచుచున్నది. ఇంద్ర ప్రేషితుఁడైన నాతని సహాయముండును గదా? మిత్త్రప్రీతిచే వచ్చినఁ గిరీటి యీతనికిఁ దోడ్పడఁ గలఁడు. అతఁడు పరమశివునిఁ గూడ రణమున నొప్పించిన మేటి. పాశుపతాస్త్రము వడసిన ధన్యుఁడు. కాఁబట్టి మన మీ తరుణమున యుద్ధముసేయఁ బూనుట కంటె నూరకుండుట మేలగును.

కర్ణ:— అర్జునుఁ డంత మొనగాఁడని యెంచి భయపడెదవా? అది వట్టికల్ల. పరమశివుఁ డాశ్రితపక్షపాతమున

వాని శౌర్యము మెచ్చుకొనెను. అతఁడు నిక్కముగ శూరుఁడు గాఁడనుట నే నెఱుఁగుదును.

సుయోధనః—ఎది యెట్లే నుండనిమ్ము. యుద్ధయాత్రకై వెడలఁదలఁచిన వారము వెనుదీయుట శూర ధర్మము కాదు.

అన నంతఁ గర్ణాదులు దమసేనల సంసిద్ధము గావించుకొనిరి. సుయోధను నానతిచొప్పున బయలు వెడలిరి. ముందుఁ జతురంగబల మరిగెను. వారి పిఱుందన కర్ణాదులు రథారూఢులై వెడలిరి. సుయోధనుఁడు మాత్రము శిబిరముననే యుండెను. ఇట్లు కౌరవసేన వచ్చుచుండఁ దానిఁ గాంచిన గంధర్వ భటులు,

"కాల్బలగు నోరాజ భటులారా! మిడుతలు ఫల భ్రాంతిచే నగ్నిలోఁ బడులాగున మీరేల ఇచ్చటి కరుదెంచెదరు? ఇట్టి వలవని విద్వేషము మీకు క్షేమావహము కాదు."

"యుద్ధమాడవచ్చిన వారితోడ నాయీ వినయోక్తులు వల్కుట? రణము సేయఁజాలకుంటిరేని మారాజును శరణు పొందుఁడు. అతఁడు దప్పక మిమ్ము రక్షింపఁ గలఁడు."

"మీపైఁ గనికరమూని మే మిట్లాడితిమిగాని మా యశక్తతచేతఁ బలుకుచున్నామని యెంచకుఁడు. మీకుఁ జేటుకాలము దాపించి యుండుటచే ఇట్టి బుద్ధి యుదయించెను. "వినాశకాలే విపరీతబుద్ధిః" అనుట నిశ్చయము కదా? కానిఁడు ఇంక మా బలము చవిచూడుఁడు."

రాజభటుల మాటలు విన్నతోడనే ఆగ్రహము పెచ్చు పెరుఁగఁగా హుంకరించుచు గంధర్వ భటులపై బాణములు

వైచిరి. వారు వీరిశరములు దమపైఁ బడకుండఁ దమ చేతి యమ్ములచే ఛేదించి కౌరవసేనపై శరవర్షము కురిపించిరి. గంధర్వుల బాణములచేఁ సుయోధనుని సైన్యము మిగుల నొచ్చి మిక్కిలి యలిగి వాఁడి యలుగులచే గంధర్వ సేనను నొప్పించెను. సైనికులతోఁ బాటు సేనానాయకులును విజృంభించిరి. క్రమక్రమముగ గంధర్వుల బలము దఱుగఁ జొచ్చెను. అంతఁ గలఁతజెంది గంధర్వ సైనికులు చిత్రసేనునొద్ద కరిగి మొఱలిడిరి. అతఁడాగ్రహోదగ్రుఁడై తన సేనల మరల యుద్ధసన్నద్ధులు గావించి తగిన సేనాపతుల నేర్పఱచి రణరంగమునకుఁ బంపెను. వచ్చినవా రెదురులపై బాణవర్షము గురిపించిరి. కౌరవులను వాఁడియగు బాణములఁ బ్రయోగించుచుండిరి.

ఇట్లిరువాగుల వారును బరస్పరము సమానముగా యుద్ధము సేయుచుండిరి. గంధర్వసైన్య మప్పటప్పటి కభివృద్ధ మగుచుండెను. అట్లభివృద్ధి యగు కొలఁది గౌరవసేన దఱుగఁ జొచ్చెను. కర్ణుఁడుదక్కఁ దక్కిన సేనాపతులు సుయోధనుని యొద్ద కరిగిరి. రాధేయుఁడు మాత్రము సుస్థిర హృదయుఁడై నిలిచి యర్ధచంద్రాది బాణములఁ బ్రయోగించి వారి దేహములు ఖండించుచు నిమిష మాత్రమునఁ బెక్కుర సైనికుల నిహతులఁ గావించుచుండెను.

ఇతఁడు సంహరించు కొలఁదియు గంధర్వులు శత సహస్ర సంఖ్యలుగా నభివృద్ధు లగుచుండిరి.

అచ్చట సుయోధనుఁడు దన సైన్యములును సేనానాయకులును బర్వెత్తివచ్చుటఁ జూచి క్రోధావిష్టుఁడై తిరిగి సేనల సన్నద్ధములు గావించుకొని సోదర సహితుఁడై యొంటరిగానుండు కర్ణునకు సాయపడనెంచి యుద్ధభూమికి వచ్చెను. అతని యుత్సాహ వచనములచే ద్విగుణితోత్సాహము లగు సేనలు శాత్రవుల మఱల డీకొనెను. శత్రుభీకరుఁడై కౌరవనాథుఁ డరుదెంచి యుద్ధముసేయు చుండుట దెలిసి చిత్రసేనుఁడు రణరంగమునకు వచ్చెను. మాయాయుద్ధ ప్రవీణుఁడగు నాతఁడు దనమాయా బలమున సూర్యుని మఱుఁగుపఱచి దిక్కులెల్ల దట్టమగు చీకట్లు క్రమ్ముకొనునట్లు చేసెను. ఆయంధకారమునఁ గౌరవ సేన కేమియుఁ గోచరింపకుండెను.

అతిరణమున గంధర్వసైనికులు కౌరవ సైనికులహతము గావించుచుండిరి. శత్రుహతి కోర్వలేక సుయోధనుని సేనలు చెల్లాచెదరై పఱచి పోయెను. కర్ణుఁడు విరథుఁడగుటచే వికర్ణుని రథమెక్కి యుద్ధభూమినుండి తొలఁగి చనియెను. సుయోధనుఁడు మాత్రము ధైర్యము వీడక పరబలముల సాధ్యమయినంతవఱకుఁ ద్రుంచుచుండెను. చిత్రసేనుఁడు వాని సమీపించి యెదిరి రథమును భగ్నముగావించెను విరథుఁడయ్యును సుయోధనుఁడు గాండీవమునఁ యున సైన్యమును మఱల నుత్సాహపఱచుట కుద్యుక్తుఁ డయ్యెను. అతఁడట్లున్న వరత నుండుటగావించి యూడఁబట్టి నేలపైఁ బడవైచి పెడ చేతులు గట్టి సింహనాదము గావించెను. చిత్రసేన సహచరులు

సుయోధన పరివారజనమును, దుశ్శాసనాదులను బట్టి బంధించి చిత్రసేనున కర్పించిరి. హతశేషులు చెదిరి యాక్రోశించుచుఁ బఱచిరి. గంధర్వరాజు నిజ భటులఁగాంచి;

“ ఈనీచుఁడు రాజపదవి కనర్హుఁడు. వీఁడు మహారాజు కదా యని భావించి మన్నన సేయవలదు. సానుజుని వీని శృంఖలాబద్ధుఁ గావించి నావెంటఁ గొనిరండు. వీని స్త్రీజనమును మాత్ర మూరక కొనిరండు. వారి నేమాత్రమును బాధింపకుఁడు.”

అని తన భటుల కానతిచ్చి యచటనుండి కదలి చనెను. భటులు చిత్రసేను నానతిచొప్పునఁ గౌరవులకు సంకెళులు దగిలించి తనవెంటఁ గొనిపోవుచుండిరి. అంతఃపుర నారీవర్గము వారి యాజ్ఞకు లోఁబడి యూరక వారివెంట జనుచుండెను.

# ఆపన్న సంరక్షణము

ద్వైతవనమున ధర్మరాజొక యజ్ఞము గావించుచుండెను. నానా ప్రదేశములనుండి ఆ యాగము గాంచ మహర్షు లనేకులు వచ్చియుండిరి. వేదఘోష మెల్లెడల ధ్వనించుచుండెను. సూర్యదత్తమగు పాత్రము మహిమచే వారల కందఱకు యథేచ్ఛగా యాజ్ఞసేని మృష్టాన్న మిడుచుండెను. భీమాదులు వారినిఁ బెక్కువిధముల సత్కరించు

చుండిరి. ఋషులు వీరి యాదరణ కొంతయు నలరి వీరిని దీవించు చుండిరి.

ధర్మసుతుఁ డిట్లు యజ్ఞ దీక్షితుఁడై యుండ నొక్క నాంటి యుదయమునఁ గొంద అచ్చటికి వచ్చిరి. వచ్చిన వారు కౌరవ సేనలోని వారగుటచే ధర్మజునకుఁ బరిచిత పూర్వులయి యుండిరి వారి మోముల వైవర్ణ్యము చూచి ధర్మరాజు విభ్రాంతుఁడాయెను. కౌరవసైనికు లాతనిఁ గాంచి;

“మహాత్మా! శరణాగతులగు మాకభయమొసఁగుము. అదె మీసోదరుల సుయోధనాదుల వనితా జనములతోడ గంధర్వులు బంధించి కొనిపోవుచున్నారు. వారిని గాపాడ నీవ వలంతివి.”

భీమసేనుఁ డిదివిని యత్యంత సంతుష్టాంత రంగుఁ డయ్యెను. నవ్వుచు ధర్మజుం గాంచి;

భీమః— అన్నా! ఎట్టి సువార్త నేఁడు వినఁగలిగితిమి! మనము చేయవలసిన పనిని మన కేలాటి కష్టము లేక గంధర్వులు సులభముగా నొనర్చిరి. మనకుఁ జాలకనయ్యెను. మన మూరకుండఁగనే జయము గల్గుట గదు మోదావహము. సుయోధనుఁడు పుట్టుకల్లరి. పాపములకుఁ బుట్టినిల్లు. లోకులచేఁ దిట్టులు పడుచుండువాఁడు. అట్టివానిని యిట్టి కష్టముల పాలు గావించిన విధాత యతిచతురుఁడు. వాఁడు రాజ్యమదాంధుఁడై, యడవినిఁబడి పలుకష్టము లనుభవించుచుండు మనలఁ బరిహసింపనెంచి యిచ్చటి కరుదెంచెను. కాఁబట్టి

దానికిఁ దగు ఫల మనుభవించెను. ఇఁక వానియెడ దయ తలఁపకుండుట భావ్యము.

ధర్మరాజు:— సోదరా! నీ విట్లాడుట సరియా! ఇది రక్షింపుటకుఁ దరుణముగాని పరుషవాక్యములు పలుకుచు నుపేక్షింప సమయము గాదు. మనల శరణుసొచ్చిన కౌరవ సైనికుల కభయ మొసఁగవలదా? వారిరాజు నాపదనుండి తొలఁగించినఁ గదా వారి కభయమిచ్చి నట్లగును? ఏకవంశ సంజాతుల కర్థాదుల మూలమున నొకొక్కమారు విరోధము గలుగుటకలదు గాని సహజస్నేహము మానునే? జ్ఞాతి జనమునకుఁ దమలోఁ నెట్టివాడైన నొవ్వనుగాని యన్యుల వలనఁ బరిభవము గలిగినప్పుడు దా మొండొరు లేకమగుటయే యుక్తము. సుయోధనుఁడు దుష్టుఁడే యగుఁగాక. వనితా జనములతోడ శత్రువులచేఁ బట్టువడినవాని నుపేక్షించుట న్యాయవిరుద్ధము. ఆపద జెందిన వాఁ డెట్టివాఁడైనను రక్షించుట యవశ్య కర్తవ్యము. భూతదయా పరుఁడవగు నీ కిది క్రొత్తగాదు. లెమ్ము. నీవును నీ సహోదరులును వెంటనే వెడలి శత్రువుల దాఁకి సానుజుఁడగు సుయోధనుని దెండు. ఆలసింపకుఁడు.

భీమ:— అన్నా! అనుమాన మించుకయును లేక నాఁడు నను జలములలోఁ ద్రోచినది మఱచితివా? విషమిశ్రిత మగు యన్నమును బెట్టి నన్నుఁజంపఁ జూచినది యెల్ల విస్మరించితివి? లాక్షాగృహమున నాఁడు మనల దగ్ధులఁ గావింపఁ బూనిన దింతలోనన మఱపునకు వచ్చెనే? మాయజూదమున

మనల నోడించి యుధిష్ఠిరుల పాలు గావించిన దేల తలఁపవు? ఆదినుండి యీ నీచుఁడు మనల నేదినము కష్టపెట్టకుండెను? అట్టి ద్రోహి మెడనా కరుణచూపుట! ఇది తగదు. కతదు.

ధర్మరాజు:— వాఁడట్టి ద్రోహియైనను ఆపద చెంది యుండ నవి విస్మరింపవలయును. వానికి మన పరాక్రమము దెలియును గాఁబట్టి మనము వచ్చి వానిం బ్రోఁచెదమని గంపెఁడాసతో నెదురు చూచుచుండును. యజ్ఞదీక్షితుండ గానున్న యిమ్మింత సిద్ధ్యాధింపక యేన యరిగియుందును. కాఁబట్టి మీరేఁగి గంధర్వుల సాంత్వ వచనపూర్వకముగా ననునయించి వానిని విడిపించునది. సామవాక్యములు పనికిరాని యెడలఁ బరాక్రమము జూపియైనఁ గార్యము కొనసాగించుకొని రావలయునది.

భీమ:— అట్లే దేవరవారి యానతిచొప్పున జరిపెదము అని యాడెను. అంతఁ బాండవులు నల్వురును యుద్ధసన్నద్ధులై తమ యగ్రజన్ముని వీడ్కొని కదలి చనిరి. గంధర్వులు వెడలిన దిక్కు సుయోధనుని పరిజనులవలన నెఱిఁగి యతి త్వరితగతి నావైపున కరిగిరి. కౌరవ సైన్యమును వారితోడఁ బోవుచుండెను. గంధమాదనమునొద్ద వారిని గలిసికొనిరి. గంధర్వులు జయము హొందిన వారగుటచే ద్విగుణితోత్సాహులై శాత్రవుల నెదుర్కొనిరి; అన్నమాటఁ దలఁచిన యర్జునుఁడు వారి నెదురింపక;

"గంధర్వులార! మీకును మాకును యుద్ధమేల? కౌరవరాజును వదలుఁడు. రాజశ్రేష్ఠుఁడగు ధర్మరాజు నానతి యిది. మీరు దీనిని తిరస్కరించుట పాడిగాదు."

"వీరవరేణ్యా! ధర్మరాజు మాకుఁ బ్రభువు కాఁడు. మే మేల యాతని యాజ్ఞ పాటింపవలయును? మా ప్రభువగు దేవేంద్రు నానతినే ఈ కార్యము మాచేఁ గావింపఁబడియెను. అతఁడు దక్క మమ్మెవ్వఁడును శాసింపలేఁడు."

"మాయన్న పలుకులు పాటించి మీతో మున్ను సామవాక్యము లాడితిని. ఇఁక నాల్గవ యుపాయమే యాచరింపఁ దగినది. ఇదె నా శరములు మిము దారికిఁ దేఁగలవు. నా గాండీవము సుయోధనుని విడిపించుననుట మీ రింకను దెలియకున్నారు."

అని యా గంధర్వులపై బాణజాలములు ప్రయోగించి వారిని నొప్పించెను. వారును వెనుదీయక పోరాడ దొడఁగిరి. పార్థుఁడు వారి శరముల ఖండించుచుఁ, జాపములఁ దెగనఱకుచు, బాహువుల ఛేదించుచుఁ, దలలఁ దునుముచు; ఆరణరంగమెల్ల రక్తమయముగ గావించెను. హతశేషులు వీరితో జగడమాడలేక సుయోధనాదుల వెంటనిడుకొని యాకాశమార్గమునఁ బోవ నుపక్రమించిరి. ఇది తెలిసిన సవ్యసాచి యాకసముచుట్టును బాణములతోఁ గప్పెను. ఆ శరములఁ ద్రెంచుకొని వెడలలేక తన్మధ్యమున వలఁదగులుకొనిన మృగములవలెఁ జిక్కుకొనిరి.

అంత వారు సేయునదిలేక యర్జునునిపైఁ బెక్కు బాణములనేసిరి. అతఁడు వానినెల్ల ఖండఖండములుగా గావించుచుఁ దన శరములచే వారి యొడలెల్ల రక్తమయముగా నొనర్చెను. ఆగ్నేయాస్త్రమున వారిని దహింప మొదలిడెను.

హతశేషులగు గంధర్వభటులు అర్జునిపైనుని శిలలు విసిరివైచిరి. పార్థుఁడు వానిని నుగ్గుచేసెను. మాయాయుద్ధకోవిదుఁడగు చిత్రసేనుఁడు మఱుఁగుననుండియే కిరీటిపై బాణవర్షము గురిపించెను. గాండీవియు శబ్దవేదులగు బాణముల మూలమునఁ జిత్రసేనుని గాత్రము గాయపఱచెను. అర్జునుని బాణములచే నొచ్చి యాతని మార్గణజాలని చిత్రసేనుఁ డింతదాఁక మఱుఁగున నుండిన వాఁడిప్పు డాతని యెదుట వచ్చి నిలిచెను. విజయుఁ డింతవఱకుఁ బగతుఁడని తలఁచినవాఁ డత్యంత మిత్రుఁడగు చిత్రసేనుఁ డగుట కాశ్చర్యము నొంది;

"ఆహా! మిత్రమా! నీతోడనా నేను యుద్ధమున కువక్రమించితిని ? కౌరవరాజగు సుయోధనుని సోదరవర్గము తోడను వనితాజనముల తోడను విడిచి పుచ్చుము."

"నచ్చరీ! ఈదురాత్ముఁడు రాజ్యవిహీనులై కానలఁ గష్టపడుచుండు మిమ్ముపహసింప దలఁచి వచ్చెను. ఇది తెలిసి ఇంద్రుఁడు వీనిఁబట్ట నన్నంపెను. కాఁబట్టి వీని నింద్రుని పాలికిఁ గొనిపోవుచున్నాను. నీవింక దీని కడ్డుపడకుము. నిను బ్రార్థించెదను."

"ఈ సుయోధనుఁడు మాకు సోదరుఁడు గావున వీనిని విడుచుట ముఖ్యము. ధర్మరాజునకిది యెంతయు సంతోష

కరము. అమరేంద్రు నాజ్ఞయైనను నీవు నా మాటలఁ బాటించి ధర్మరాజునొద్ద కతనిఁ దోడ్కొనిరమ్ము. అతని యానతి చొప్పున జరుప వచ్చును."

ఆవలఁ జిత్రసేనుఁడు సుయోధనాదుల వెంట నిడుకొని పాండవులతోడ ధర్మరాజు చెంతకు వచ్చెను. అజాతశత్రుఁ డాతనిఁ జూచి ;

"మహాత్మా ! ఈ సుయోధనుఁడు సపరివారుఁడై మీచే వధింపఁ బడకుండుటకు ఏనెంతయు సంతసించు చున్నాను. ఇతఁడెట్టి మహాపరాధి యైనను మాకుగా ఈతని విడువవలయును."

"యుధిష్ఠిర చక్రవర్తీ ! ఎట్టివారైనను మీమాట దాఁట నేర్తురే ? మీయానతి చొప్పున వీని విడిచి పుచ్చితిని. ఇంకనే నిట్టి యకృత్యముల సేయకుండు లాగున బుద్ధి గఱపి యుంపుడు."

అని వారిని విడిచి ధర్మజుని సెలవుగైకొని చిత్ర సేనుఁడు తన పరివారముతోడ నరిగెను. యుధిష్ఠిరుఁడు సుయోధనునకు బుద్ధులు సెప్పి విడిచిపుచ్చెను. సుయోధ నుఁడు దన యసమీక్ష్యకారిత కెంతయు నొచ్చుకొనుచుఁ జనెను.

పడియు మఱల మఱల వీరియభిప్రాయములనే యనుసరించుట నా తెలివి తేమిని ప్రకటించు చున్నది. ఇంతటికిని మూలకారణము మా దురాశయే యగుచున్నది. పుట్టు బీదనైనను కలిగినదాని తోఁ దృప్తిపడు వానికుండు సౌఖ్యము ధనికునకైనను దురాశా కలితునకుండఁజాలదు. ఆశ విడచినవాఁడే ధన్యుఁడు వాఁడే సర్వసుఖములనుభవించు వాఁడు. లోభము మూలమునఁ గదా నాకింతటి యవమానము కలిగెను?

ఓరా! రారాజని పేరుగాంచి యొక తుచ్ఛునికిఁ జిక్కుట కంటె మానహాని యొకటి గలదే? నాకుఁ దటస్థించిన దానికి నే నంతగా వగచుట లేదు. నాకంటి యెదుట అవరోధజనము గాలినడకం బిలుచుకొని వచ్చుచుండఁ బ్రతీకారము సేయఁజాలక జీవచ్ఛవమై మిన్నకుండుట నాహృదయమును గాల్చివేయు చున్నది.

అపకారి యని భావించి యుపేక్షసేయక ఆపన్నుఁడను గదా యని కనికరించి నన్ను గాపాడిన యా మహాభాగుల సుస్వభావ మెంతయుఁ గొనియాడఁ దగినది. అసూయ మాట విని యట్టివారిని అనేక బాధలకు గుఱి చేసితిని. ఇట్టి నా బ్రదుకేల? నే నిచ్చటఁ బ్రాయోపవిష్టుఁడనై ప్రాణముల వీడు వాఁడను.”

అని యీలాగున యతఁడు చింతించుచుండ వాని యొద్దకుఁ గొందఱు వచ్చిరి. వారలఁగాంచి యాతఁడత్యంత విషాదముతోడ ;

"మీపలుకులు విని నేఁబడసిన పాటులు చాలును. ఇంక నాజోలికి మీరు రావలదు. నేనిస్థలముననే ప్రాయోపవిష్టుఁడనై ప్రాణములు విడెదను నేనీసంసారము వలన విరక్తుఁడ నైతిని. సుయోధనుఁడు ఇంక నామమాత్రావశిష్టుఁడగునని యెఱుఁగుఁడు. దుశ్శాసనా! నీవిఁకఁ బట్టాభిషిక్తుఁడవు గమ్ము. ఎప్పట్టునను బరబుద్ధి విడి నీకుఁదోఁచిన లాగునఁ బ్రవర్తించుట సరియగును—కర్ణా! నీవును ఇది మొదలు సద్బుద్ధిగలవాఁడవై మనుము. దుష్టవానిని మంచి దారికిఁ ద్రిప్పియారయుచుండుము—వికర్ణా! నీమాటలాది నుండియు వినకుంటిని. దానిఫలమిపు డనుభవించితిని. నీపై నలిగి నన్నాడిన యాపరుషవచనముల మఱచిపొమ్ము. సోదర ప్రీతిని విస్మరింపకుము.—మామా! ఈకుట్ర నేరిని ఎవ్వరును గపటకృత్యము లాచరింపఁబురికొల్పక యూరకయుండుము."

ఈ పలుకులు విని దుశ్శాసనుఁడు గడు దుఃఖితుఁడై ఆతని పాదములపైఁబడి ప్రాయోపవేశము మానుమని ప్రార్థించెను కర్ణుఁడాతనిచెంతఁ జేరి మరణోద్యోగమునుండి నివర్తింపఁ బలువిధముల హితబోధ యొనర్చెను. శకునియు వానికి బెక్కురీతుల బుజ్జగించుచు వాని వ్యసనము మాన్పఁ జూచెను. వీరి మాటలఁగాని, చేతలగాని సరకుసేయక యా సుయోధనుఁడు వారిని గాంచి;

"మీరేల నాకొఱకై పరితపించెదరు? ఇంక నా కైహికసుఖముల యందభిలాష లేదు. ప్రాయోపవిష్టుఁడనై మరణింపఁ గృతనిశ్చయుఁడ నైతిని. మీరిఁక నెంత యడ్డు

వాట్లు వేసినను అప్రయత్నము మానఁజాలను. మీరిచ్చట నిలువకుఁడు. వెంటనే వెడలుఁడు. ఇది నాశాసనమని భావింపుఁడు.”

అంత వారెవ్వరును ఆతని యానతి కెదురాడ వెఱచి చింతతోఁడ ఆశిబిరము వీడి వెలుపలికి వచ్చిరి. సుయోధనుఁడు దన యాసనమునుండి దిగి యొకదర్భాసనము పఱుచుకొని అందాసీనుఁ డయ్యెను. పరబ్రహ్మను ధ్యానించుచు బాహ్యేంద్రియ జ్ఞానము వీడి సమాధినిష్ఠితుఁ డయ్యెను.

## అసురోపదేశము

ఇంద్రావమానితులగు నసురులు నాగలోకమున వసించుచుండిరి. వారు దేవేంద్రు నవమానింపఁ దఱివేచి యుండిరి. ఇంద్ర ప్రేషితుఁడగు చిత్రసేనుని మూలమున సుయోధనుఁ డవమానితుఁ డగుట తెలిసికొనిరి. దీని నాధారము గావించుకొని దేవాంశ సంభూతులగు పాండవుల సంహరించి దానిమూలమున దేవతల కవమానము గల్పింప నెంచిరి.

అంత వారు శుక్రాచార్య ననుమతిని యథావిధిగా నగ్నిని వ్రేల్చిరి. అందుండి కృత్యయొక్కటి యుదయించెను. దానిని బంచి సుయోధనుని దమయొద్దకుఁ దెప్పించుకొనిరి.

ఇంతదనుక సమాధినిమగ్నుఁడున్న రాజరాజున కేదియుఁ దెలియకుండెను. వార లాతనిఁ జూచి ;

“సుయోధనా! లెమ్ము లెమ్ము. క్షేమకాల మాసన్నమయియుండఁ బౌరుషమును మాని ఈలాగున సమాధినుండుట దగదు.”

అని వారాడిన పలుకులు విని అతఁడు కనులువిచ్చి చూచెను. తానిప్పు డొక క్రొత్తలోకమునకు వచ్చియుండుటయుఁ, దనయెదుటఁ గ్రొత్త వారెవ్వరో, యుండుటయుఁ గాంచి విభ్రాంతుఁ డయ్యెను. అప్పు డసురులు వాని భ్రాంతి నాఁపఁగోరి ;

“అయ్యా ! నీవు వింతపడ నక్కఱ లేదు. ఇది పాతాళలోకము. మేమిచ్చట వసించునట్టి యసురులము. సాహసకార్యమునకుఁ గడఁగిన నిన్నుద్ధరింపఁ దలఁచి కృత్యమూలమున ఇచ్చటికిఁ బిలిపించితిమి. నీవు శూరుఁడవు. బలవన్మరణము శూరునకుఁ దగినది కాదు. ఆత్మఘాతి ఇహపరలోకముల రెంటను జెడును. కాఁబట్టి ఈ దురుద్యమమును వీడుము. ధైర్య మవలంబింపుము. నీవు మనుష్యమాత్రుఁడవు గావు. నీ ప్రభావము నీ వెఱుఁగవు.”

నాప్రభావ మెట్టిదియో తెలుపఁగలరా?”

పూర్వము ఇంద్రునిచే జయింపఁబడిన మేము శివుని గూర్చి తప మొనరించితిమి. అతఁడు మాయెడఁ బ్రసన్నుఁడయి మమ్ము రక్షించుటకుగా నిన్ను సృజించెను. నీవు మా కధిపతివని యాతఁడనెను. నీకు సాయపడుట కయి మా కుంశ

ములు భగదత్తాదులు జనించియున్నారు భీష్మాదులు దేవాంశమునఁ బుట్టిన వారయ్యును వారిభావములు రాక్షసావేశమును బొందఁగలవు. దానఁజేసి వారు నిర్దయులై, పరుషమును పలుకుచుఁ, గోపము మిగుల, గురుశిష్య బాలవృద్ధభేదము విచారింపక యుద్ధము చేసి పాండవ పక్షమును నాశము గావింతురు. పాండవులు దేవాంశ సంభూతులు. కాఁబట్టి మన కవశ్యము విరోధు లగుదురు. బంధుస్నేహము వీడి నీతో యుద్ధమున కుపక్రమించి నశింతురు. కృష్ణునిచేఁ జచ్చిన నరకాసురు వంశము కర్ణు నావేశించియున్నది. ఆ కారణమున రాధేయుఁడు కృష్ణార్జునులఁ జంపఁగలఁడు. సంశప్తకులను నసురులు మనకు సాయపడెదరు.”

ఇదివిని సుయోధనుఁ డీలాగునఁ దలపోయఁ దొడఁగెను.

“ఐహిక సౌఖ్యముల విరక్తుఁడై పడియుండు నాకు వీరిటు బోధయొనర్చి మరల సంసారమునఁ బడవేయఁ జూచుచున్నారే? పరమశివుఁడు వీరి సాయమునకై నను బుట్టించినాఁడనిరి అతని యానతి తప్పుటెట్లు? తప్పక నే జీవించి ఈ కార్యము జరుపవలసి యుండుట చేతనే మరణోద్యుక్తుఁడై పడియుండిన నన్నిచ్చటికి దైవము చేర్చెను. కాఁబట్టి యీశ్వరాజ్ఞను నే జరుపుట నాకువిధి యగుచున్నది.”

అని తలపోసి వారి యిష్టము చొప్పునఁ గార్యము పూర్తి గావింప నంగీకరించెను. అసురులు సంతోషించి కృత్యమూలమున సుయోధనుని భూలోకమున కంపిరి.

# వైష్ణవ యాగము

హస్తినాపుర ప్రాంతమున ఒక విశాలమైన బయలున యజ్ఞవాట మొక్కటి యమరియుండెను. అచ్చట యూప స్తంభములు నాటి యుండిరి. అందు యజ్ఞవేదికలు గట్టఁబడి యుండెను. యజ్ఞవాట మెల్లెడలను దోరణాదులచే నలంక రింపఁబడి యుండెను. సుయోధనానుమతిని నానా దేశా ధీశులు కానుకలతోడ వచ్చియుండిరి. భూసురులనేకులు ఆజ్ఞముగాంచ నరుదెంచి యుండిరి.

అంతఁ గౌరవశ్రేష్ఠుఁడు ఒక్క సుముహూర్తమున యాగదీక్షఁ బూనెను. యజ్ఞ మారంభమయ్యెను. వేద ఘోషలు చెవుల పండువ సేయుచుండెను. స్వాహాకారముల తోడ స్రుక్ స్రవములనుండి యగ్నిని వ్రేల్చఁబడునాహుతి ఘ్రాణ తర్పణము గావించుచుండెను. వీరు వారని భేదము లేక ఎల్లవారు సంతృప్తులై భుజించుచుండిరి. దానాధికారము విదురు నందిడి యుండెను. దాననందరును భూరిదక్షిణలఁ దనియుచుండిరి. అచ్చటికి వచ్చినవారిలో ఒక్కఁడైన రిత్తచే తులతో మరలిన వాఁడు గాఁడు.

యజ్ఞాంతమున సుయోధనుఁ డవభృథ స్నానము చేసెను. అధ్వర్యులు మున్నగువారలు దగురీతిని గౌరవింపఁ బడిరి. వచ్చిన బ్రాహ్మణులాతని దీవించి;

"హరిశ్చంద్రుఁడు మున్ను గొప్పయాగ మొనర్చెనని వినియుంటిమి గాని చూచి యెఱుఁగము. ధర్మసుతుని రాజ

మాయుము చూచి యుంటిమి. అది దీంతో సాటిరాఁజాలము. పూర్వపురాజు లనేకులు ఈ యజ్ఞము చేసి కాదె అఖండ కీర్తి వడసిరి."

అని నానావిధముల స్తుతించి వెడలిరి. సుయోధనుఁడు భీష్మాది గురు జనులకు నమస్కరించెను. వా రాతని దీవించిరి. అనంతరము నగరులోని కరిగి కర్ణశకుని దుశ్శాసనాది పరివృతుండై ;

సుయోధనః— చూచితిరే యీ పాండవుల గర్వము ! రాజు లెల్లరును నాయాజ్ఞ శిరముల్ఁదాల్చి యజ్ఞమునకు వచ్చి యుండ వా రుదాసీనులై రాకుంకిరి. ధర్మరాజు నొద్దకుఁ బ్రత్యేకముగా దూత నంపియుంటిని. అనూయాగ్రస్తుండై తాను రాకుండుటకుఁ బదమూఁడేఁడులు గడువ లేదని నెపము గల్పించెను. అది యటుండనిండు. ఈ వృకోదరున కింత గర్వితనము దగునే? "పదమూఁడేఁడులు గడచిన పిమ్మట శస్త్రాస్త్ర దహనమునఁ గౌరవులఁ బశువులుగా వరించి వేల్చి యుద్ధయాగము సేయు ధర్మసుతుండు రాఁగలఁ" డని చెప్పి పంపెను. జ్యేష్ఠునకు దూత నంపితిమి గాని వీనిఁ బేరత్రియేనిఁ బిలిచితిమే? అట్లుండ వీని కేల ఈ యధిక ప్రసంగము? అర్జునుఁడును వాని మార్గమునే యనుసరించెనఁట.

దుశ్శాసనః— అన్నా ! భీముని బరిమార్ప నా కనుజ్ఞ యిండు. ఇప్పుడ యరిగి వాని తలఁద్రెళ్ల నేసెదను.

కర్ణ:— అర్జునుఁ డాతని మార్గము ననుసరించిన వానిని నా బాణాగ్నికి ఆహుతి యొనర్చెదను. వాఁడేమి యంతటిపోటు మానిసియా?

సుయోధన:— సోదరా! మిత్రమా! మీ బలములు నే నెఱుఁగని వాఁడను గాను. తొందరపాటు పనికిరాదు. ఇంకను గొంత యోరిమి వహించుట యుక్తము. శస్త్రచికిత్సకుఁడు వ్రణము పండుటకై నిరీక్షించుచుండును గాని లేఁతలోననే కోఁత వెట్టఁ జూడఁడుగదా?

శకుని:— నీకింకను పాండవులయెడ నభిమానము మాన కున్నది. కాఁబట్టియే వీరిమాటల నిరాకరించుచున్నావు.

సుయోధన:— అలాగున మీ రెంచుట పొరపాటు. మన మెల్లరము పాండవులకు సహజవైరులము. వారు దేవాంశ సంభూతులు. మన మసురాంశ సంజనితులము. అట్టియెడ నాకు వారిపై నేల యభిమానముండును? మీ సహాయమునఁ గదా నిస్సపత్నముగ రాజ్యమేలుచున్నాను. నే నెల్లప్పుడు మీ యెడఁ గృతజ్ఞుఁడ నని భావింపుము. ఇఁకఁ బాండవులఁ దప్పక నామమాత్రావశిష్టులఁగాఁ జేయఁగలను. ఇది నిశ్చయము.

శకుని:— అట్టి నిశ్చయము గల్గియుంటివేని నేఁటి మొదలు భీష్మద్రోణాదులఁ బెక్కువిధములఁ దృప్తిపఱచు చుండుము.

సుయోధన:— ఇదియింతకుమున్నే సంకల్పించుకొంటిని.

అని నాఁటి రహస్యాలోచనాసభ చాలించి ఎల్లరు వారివారి యునికిపట్టు కరిగిరి.

# మత్స్యపుర ప్రయాణము

పాండవులు పన్నెండేండ్లు అరణ్యవాసము సల్పి పదమూఁడవ యేట నజ్ఞాతవాసము సేయ మొదలిడిరి. సుయోధనుఁడు వారిని వెదుక వేగులవాండ్రఁ బెక్కురఁ బంపెను. వా రనేక స్థలముల వెదకిరి. పాండవుల జాడ వారి కెందును గానిపింపకుండెను. ఈలాగున వెదకి వెదకి వేసారి వారు సుయోధనుని పాలికి వచ్చి;

" మేము పెక్కుచోటుల వెదకితిమి ఎందును బాండవుల యునికి మాకు గోచరింపకుండెను. ద్వారకకు రథము పోవుచుండ అందుఁ బాండవు లున్నారేమో యని తలంచితిమి కాని యా రథము వారిది కాకుండెను. విరాట నగరమునఁ గీచకుని వాని సోదరులతోడ ఒక వనిత కొఱకై గంధర్వులు చంపిరని తెలిసి అది భీముని కృత్యమేమో యని యెంచి యందు వెదకఁ జొచ్చితిమి. పాండవుల జాడ అంగించుకయుఁ గానుపింప కుండెను. మిక్కిలి పాడిపంటయును నుండుటచే గర్వించి మీ మాటలఁ దిరస్కరించు నా విరాటుని వ్యసనవృత్తాంత మగుటచే దేవరకును విన్నవించితిమి. దేవరవారి యాజ్ఞయైనచో మఱల వెదకఁ బోయెదము "

సుయోధనుఁ డీమాట లాలకించి వేగులవాండ్ర వెంటనే పాండవుల వెదకఁ బంపెను. తాను సభాభవనమునకు వచ్చి సభలోని వారిఁ గలయఁజూచి;

సుయోధనః— పాండవులఁ గనిపెట్టుట కుపాయమేమైన నున్నదే?

దుశ్శాసనః— ఏమి యీ వెఱ్ఱి! వారప్పుడే యే మృగ ముఖమో ఆహారమయి యుందురు. వీరికేల వలవని కష్టము?

ద్రోణః— బలవంతులగు పాండవుల కావడ గలుగుట కల్ల. వీరికి శక్తియున్న వారిజాడ లారయుటకుఁ గడఁగుడు.

భీష్మః— ఆచార్యుని మాటలు నిక్కములు. దైవ మానవ బలములు రెండునుగల యీ పాండవుల కావడ గలుగ నేరదు. పాండవధార్తరాష్ట్రులిర్వురును నాకు సమానులే యగుదురు. అయినను సభలోఁ దన్నుఁ బ్రశ్నించినపుడు తెలిసినది చెప్పకుండుట యధర్మము. కాఁబట్టి తెలిపెదను. వినుఁడు. ధర్మస్వరూపుఁడగు ధర్మపుత్త్రుఁ డుండుచోట ధనధాన్యములును, పసులపాడియు సమృద్ధములయి యుండును. అట్టి దేశమెద్దియని తెలిసికొని యచ్చటకు వారిని వెదుకఁ బంపుట సరియగును.

సుయోధనః— సింహబలుఁడు, భీమసేనుఁడు, శల్యుఁడు బలరాముఁడును సమాన బలులు. సింహబలునిఁ జంపినవారు దక్షిణ మాపురిలో నొక్కరు కావలయును. శల్యుఁడు బలరాముఁడును దూరదేశవాసు లగుటచే వారాతని మృతికిఁ గారకులు గాఁజాలరు. ఇంక శేషించినది భీముఁ డొక్కఁడే గదా! కావునఁ గీచకుని జంపినది భీముఁడనుట నిశ్చయము. ఆ వనిత ద్రౌపదియే యయియుండును. గంధర్వులను నెపమున నచ్చటఁ బాండవు లున్నారలు. పితామహుఁ డాడిన యీ లక్షణములు ఆదేశమునఁ గలవఁట. కిరటుఁడు మనకు శత్రువగుటచే అతనిపైదండెత్తిపోయి యతని గోధన మపహరింతము.

ధర్మరాజాదు లెట్టియెడ నూరకుండ నేరరు. తప్పక మనపైకి వత్తురు. అప్పుడు వారి సమయభంగము దెల్పి క్రమ్మఱఁ బన్నెండు వత్సరములు వనవాసమున కంపుదము.

సుశర్మ:— రాజరాజ! ఈ మాత్రమునకు మీ రేల దాడివెడలఁ గడఁగెదరు? నాకును విరటునకును బూర్వ విరోధము. కాబట్టి నన్నంపుఁడు. వాని యైశ్వర్యమెల్లఁ జూఱఁగొని వచ్చెదను. పాండుసుతుల బంధించికొని వచ్చెదను.

సుయోధన:— త్రిగర్త దేశాధీశుఁడవగు నో సుశర్మా! నీవు ఈదినమే నీ సేనలఁగొని యేఁగవలయును. అట విరటుని పసులఁ బట్టవలయును. విరటుఁ డూరకుండక నీపైఁ బడును. పాండవు లాతని సాయమునకై వెడలుదురు. కాఁబట్టి వారు నీకుఁ జిక్కనచ్చును. అలాగున వారు రాకుండిన మఱునాఁడు మేము వేఱొకవైపున గోవులఁబట్ట వచ్చెదము. రాజును అతని సేనలును నీతో యుద్ధము సల్పుచుండుటచేఁ దప్పక పాండవులు అచ్చటికి వచ్చియే తీఱుదురు. ఓయీ! ఆలసింపక వెంటనే పయనమునకు సిద్ధుఁడవగుము—దుశ్శాసనా! రేపు మన సేన లరుగుటకుఁ దగిన సన్నాహములఁ గావింపుము.

సుశర్మ:— దేవర యానతి చొప్పుననే యాచరింతును.

అని యాతఁ డటనుండి కదలెను. తన సేనల సజ్జీకరించుకొని మత్స్యనగరాభిముఖుఁడై చనెను. దుశ్శాసనుఁడు దన సేనల సంసిద్ధములు గావింప నరిగెను. సుయోధనుఁడు భీష్మాదులఁ దనకు సాయముగా రావలయునని కోరెను. వారద్దాని

కంగీకరించిరి. అంత నాఁటి సభచాలించి యెల్లరును వారి వారి యావసథముల కరిగిరి.

## గోగ్రహణము

"రాజపుత్త్రా! మనపురమునకు దక్షిణపు దెసనుండు పశువుల శత్రుపాలురు దోలుకొని పోవుచుండఁగా ఈ లాగున నిన్నకుండుట దగునా? రాజుగారటు సుశర్మతో యుద్ధము సేయఁ బోయిరనుట తెలిసి ఇదియే యదనని భావించి సుయోధనుఁడు దనసేనతో వచ్చి గోగ్రహణ మాచరించు చున్నాఁడు. మన పశువుల మఱల్చుటకు నీవు దక్క వేఱెవ రిచటఁగలరు? బాబుగారు నీబలమును గుఱించి పలువుర యెదుట నుగ్గడించుచుందురుగదా? దానికిఁ దగులాగున నేఁడు శత్రువుల సంహరించి గోవుల మఱలింపవలయును. వెంటనే తేరు బూన్పఁ బంపుము. ఆలసింపకుము."

అని కాంతాజన మధ్యమునందు భూమింజయునిఁ గాంచి గవాధ్యక్షుఁడు పల్కెను. ఇది వినిన రాజకుమారుఁ డుత్తరుఁడు ;

ఉత్తర:— కౌరవుల జయించుట యొక కష్టములో నిదికాదు. గోవుల ముహూర్తమాత్రములోఁ దేఁగలను. ఇపుడు నాకుఁ దగినసారథి లేకున్నాఁడు కాఁబట్టి యేమి సేయుదు నని యాలోచించుచున్నాను. తగుసారథి దొరికె

నేని బగతురఁ దునుమాడుట యెంతపని ? సారథి నారిని రథముదోలుకొని నేఁ బోవులోపల యెచ్చటికి వారు పశువులఁ దోలుకొని పోవుదురోయని తలఁచుచున్నాను. నాకును గౌరవులతో యుద్ధ మాడవలయునని పెక్కు దినములుగా అభిలాష గలదు, అది యిప్పుడు గదా చేయి కూడి వచ్చెను. సారథి దొరకమిని యిప్పుడు అది వ్యర్థముగా బోవుచున్నది గదా యని చింతిల్లుచున్నాను.

భూమింజయుని యీ మాట లాలకించిన పాంచాలి బృహన్నల యనుపేరఁ బేడిరూపున నున్న యర్జునునకు దాని నెఱిఁగించెను. అతఁడు యాజ్ఞసేనిని గాంచి ;

అర్జును:— మన యజ్ఞాతవాస వత్సరము తీరె మయ్యెను. కాఁబట్టి ఇంక భయపడవలసిన యవసరము లేదు. నీవు పోయి వారలతో; "బృహన్నలకు సారథ్యమున సామర్థ్యము మెండు. మున్ను ఖాండవ దహనమునఁ బాండవ మధ్యమునకు సారథ్యముసల్పి యతని మెప్పువడసెను. తత్సహాయమునఁ గురుసైన్యముల నవలీలగా జయింపవచ్చు" నని తెల్పుము; ఎట్లేని నన్నుఁ బిలిపించులాగునఁ జేయుము.

అంత ద్రౌపది యట్లే యొనర్పులాగునకుఁ బోయి యుత్తరను సమీపించి,

ద్రౌపది:— రాజకుమారుఁడు సారథి లేమికిఁ జింతిలు చున్నాఁడఁట. మన బృహన్నల కిరీటిమనసు మెప్పించులాగున

సారథ్య మాచరించియుండెను. ఖాండవ దహన కాలమున విజయునకుఁ గలిగిన విజయమునకుఁ బృహన్నలయే కారణము.

యాజ్ఞసేని యీలాగునఁ జెప్పినంతనే యుత్తర దానిం దోడ్కొని యుత్తర కుమారుని యొద్దకరిగి;

"అన్నా! మన బృహన్నలకు సారథ్యమున సామర్థ్యము కొండని సైరంధ్రి పలుకుచున్నది. నరునకు సారథియయి ఖాండవదహనాది తరుణములందు జయము సంపాదించి యిచ్చినది ఈ బృహన్నలయే యఁట."

ఉత్తర:— సైరంధ్రీ! నన్నేల పరిహాసించెదవు? నేను జేడిఁ గన్నెత్తియైనఁ జూడ రోయుదును. అట్టి వానితోడ నా బృహన్నలను సారథిగా నొసర్చుకొను మనెదవు? ఆలాగున నొనర్చిన లోకములోనివారు నవ్వరే?

ద్రౌపది:— ఈ కురుసైన్యమును గాదుకదా! ముల్లోకము లెత్తివచ్చినను బృహన్నల సారథిగా నుండునటుకు నిన్నెవ్వరును గెలువనేరరు. వెంటనే బృహన్నల నిటకు రప్పింపుము.

ఉత్తర:— సారథి దొరకనప్పు డింకేమి సేయవచ్చును? మీ మాటలచొప్పున జరిపెదను. ఇంక బృహన్నల నిచ్చటికిఁ బిలుచుకొని రండు.

ఉత్తరా ద్రౌపదులు వెంటనే యర్జునుఁడున్న చోటకు వచ్చిరి. రాజకుమారుఁడు పిలుచు చున్నాఁడని యాడి యాతనిఁ దోడ్కొని మఱల నుత్తరునియొద్ద కరిగిరి. భూమిం

జయుఁడు బృహన్నలను సారథిగా నొనర్చుకొని రథమెక్కి కురుసైన్యము లున్నయెడల కేఁగెను. రాజకుమారుఁడు రెండవ సముద్రముఁబోలిన శత్రుసేనల దూరమున నుండి చూచినంతనే వెల్లుగ భీతిల్లెను. అర్జునుఁడాతని పెక్కువిధముల నోదార్చుచుండెను.

ఆసమయమునఁ గౌరవసేనలోఁ గలిగిన యుత్పాతములు గాంచి ద్రోణాచార్యుఁ డీలాగున ననెను.

ద్రోణ:—సూర్యుఁడు మలినత నందెను. నక్కలు కూయుచున్నవి. తూర్యములు దమంత విస్తృతముగా మ్రోగుచున్నవి. గుఱ్ఱములు నిష్కారణముగాఁ గన్నులనుండి నీరు విడుచుచున్నవి. ఈ యుత్పాతములు చూడ జయము మనకుఁ గలుగునని తోఁచుటలేదు. ఇదె యర్జునుఁడు గజయూథమును జూచి యలిగిన యాఁకొన్న సింగమురీతిని వచ్చుచున్నాఁడు. ఈతని నెదురింప జాలు సమర్థులు మనసేనలో నెవరును లేరు. పరమశివుఁ డీతని గారవించి యున్నాఁడు. వీనితో యుద్ధము సేయుటకంటె గోవుల వానికర్పించి మరలుట మేలగును.

కర్ణ:—పాండవులయెడఁ బక్షపాతమున నోటికి వచ్చినలాగునఁ బల్కుట యుచితము గాదు. కౌరవసేనలో రథికవరులెందఱుండలేరు. వారెల్ల మిన్నకుండ మీ కేల శోకము గలిగించుకొనెదరు? శక్తిగల్గిన యుద్ధము సేయుఁడు. లేకున్న నూరకుండుఁడు. నిక్కముగ వీఁడర్జునుఁడే యయిన నావాఁడి యమ్ములఁజీల్చి చెండాడఁ గలను. ఒక్క వీరునకుఁ బ్రతివీరుఁ డొక్కఁడు జాలఁడా? పెక్కు దినములుగ నేఁ బార్థునితో

దలఁపడఁ బ్రతీక్షించుచుండ నేఁటి కది చేకూరెను. మీ రేల దీనికి విఘ్నము సేయ నెంచెదరు.

సుయోధనః:—మిత్రమా! నీవు తప్పఁ బలుకుచున్నావు. ఇతఁడు పార్థుఁడే. పడవి కేఁగి భ్రాత్ప్రయుతముగా మఱలఁ బన్నెండేఁడులు వసింపవలయును.

భీష్మాదు లీతనిమాటలు విని మందహాస మొనర్చు చుండిరి. సైనికు లెల్లరు మేఁ మేలని సంతసించు చుండిరి. యుద్ధము తటస్థించిన ముందెవ్వారు రణమునకుఁ గడఁగవలయు నని వారెల్లరు నాలోచించుచుండిరి.

అప్పు డర్జునుఁడు పితృవనముందలి శమీవృక్షము చెంత రథము నిలిపెను. చెట్టుపైనుండు నాయుధముల కట్ట నుత్తరుని మూలమునఁ దెప్పించెను. దానిలోని యాయుధములను, వాని దాల్చు వారిని ప్రత్యేక ప్రత్యేకముగా వాని కర్జునుఁడు వివరించెను. తా నర్జునుఁడగు టయుఁ, గంకాదులు ధర్మజాదు లగుటయు నతని కెఱింగించెను. గాండీవము చేతఁ దాల్చెను. ఇంద్రదత్తమగు కిరీటమును ధరించెను. రథమునఁ గపిధ్వజ మును గట్టించెను. అర్జుని ప్రాపున నిర్భీకుండగు నుత్తరుఁడు సారథ్యము సేయ నమకట్టెను. అంతఁ బార్థుఁడు రథముపై నెక్కి దేవదత్తమును బూరించెను. ఇట్లర్జునుఁడు వచ్చుచుండుట గాంచిన యాచార్యుఁడు సుయోధనుని గాంచి ;

ద్రోణః:—సుయోధనా! అదె కపిధ్వజము గాంచు చుంటివే? అవచ్చువాఁడ యర్జునుఁడు. ఇప్పుడు మనము పరస్పరము వాద ప్రతి వాదములకుఁ గడఁగుట యుక్తము

గాదు. ముందు నీవు చనుచుండుము. పసులం జుట్టుకొని మేము సాయుధులమై నీవెనుక వచ్చుచుందుము. అర్జునుఁడు చెంతకు రాఁగనే అభిముఖులమై వానితో రణ మొనర్తము.

సుయోధనః— రోషముననేని రాజ్యాభిలాషముననే నర్జునుఁడు వచ్చి యుండవలయును వీనితో రణ మొనర్పవలయు టుచిత మగుచుండ ఆచార్యులు నను భీరునిగాఁ దలంచి కొందఱిని దక్కినవారు పశులను నన్ను గాపాడుచు వెనుక రావలయునని యానతిచ్చుచున్నారు. ఏమని బెదరఁజేసి, నను భీతుఁజేసి పలుకుట తగునే? వృద్ధులగుటచే యుద్ధ మొనర్పఁ జాలకుండిన ఇంటికడనే యుండరాదా? ఏల ఇప్పటికి రావలయును?

అశ్వత్థామః—తన్ను నెదిరి నెఱుఁగక గర్వాంధుఁడవై నోరికి వచ్చినలాగున వాగుచున్నావు. రణ మొనర్చి శాత్రవులఁ గెల్చి రాజ్యమును గైకొనియుండిన గర్వితుఁడవు గావచ్చును. మాయ జూదమున అమాయకులగు పాండవుల నోడించిన నీకింత నోరుండఁ దగినదియే. నాఁటి శకునియే నేఁడు నీకు సాహాయ్యము సేయును గాక. బ్రాహ్మణులము భోజన ప్రియులము. మాతో నీకేమి కార్యము గలదు? తన ప్రియశిష్యుఁడగు పార్థుని పరాక్రమము దెల్పుట యాచార్యునకుఁ దగదా? సిగ్గుమాలి యుద్ధ మొనర్చిన మాతండ్రి యాచరింపనిమ్ము. నేనిట్టిదాని కొడఁబడఁజాలను—ఓరీ! ఇది జూదము గాదు. ఇచ్చటఁ గపటబుద్ధి యుపయోగింప వీలుగాదు. ఇది రణరంగము. శత్రువుల నెదిర్చి ఘోరముగఁ బోరు సల్పవలయును. సమర్థుఁడగు వాఁడా కార్యమున కుపక్రమింప వచ్చును.

కర్ణ:—భీతివుంవున మీరెల్లరు ఇట్లాడుచున్నారు. ఇట్టి వారు తగుదుమని మేటి మొనగాండ్రవలె యుద్ధరంగమునకు ఏల రావలయును? నేనొక్కఁడ యాఫల్గునుని ఎదురింపఁ జాలనే? కర్ణార్జునులలో ఎవ్వఁడు బలవంతుఁడని మీనాళము మును చూపఁగలను. పరశురాము ననుగ్రహమునఁ బడసిన విలువిద్య ప్రకటించుటకుఁ దఱి గల్గెను. మీకు నాపోరు చూడ నిష్టమే యుండదేని లేకున్న నావలకుఁ బొండు.

కృప:—కర్ణా! నీవెల్లప్పుడు గర్వమునకు కాలు ద్రవ్వుచుందువు. దేశకాలాదుల విచారింపవు. అర్జునుఁ డేకాకియే కదా యనియెంచి ఇట్లాడెదవు కాఁబోలును? నాఁడు ఖాండవ దహనమున ఇంద్రాది దేవతలతోఁ బోరు సల్పినది అతఁ డొక్కఁడే కదా! యాదవ బలమెల్ల నెదురింపఁగా అలనాఁడు వారి నోడ్చి సుభద్రను దెచ్చినది అతఁ డొక్కఁడే కదా! గంధర్వరాజు నోడించి నీయీరాజును విడిపించినది అతఁడొక్కఁడే కదా! నాఁడు నీ వచ్చటనే కదా యుంటివి? చిత్రసేనుని ధాటి కాఁగలేక పాఱిపోవుటయు కాక చేతేమి చేయఁగలిగితివి?

కర్ణ:—కలకాల మీరాజు నన్నముఁదిని కృతఘ్నులై సమయము తటస్థించినప్పుడు ఇట్లాడుట నుచితము. మీమాటల విననొల్లను. నేనొక్కఁడ వాని జయింపఁ గలను.

భీష్మ:— సుయోధనా! ఆచార్యుని మాట లధిక్షేపార్హములు గావు. కృపాశ్వత్థామల పలుకులు యుక్తతరములు. అందు వెనుక లాగుచు వారిని దూషింపకుము— కర్ణా!

సమయ మెఱుఁగక కేవల మసూయాపరవశుఁడవై ఈలాగున నాడుట పాడిగాదు—ఆచార్యా! ఆచార్యపుత్త్రా! కృపాచార్యా! బాలుఁడు. మీ శిష్యుఁడు. తెలివిలేమి నేదియో పల్కిన దాని క్షమింపవలయును గాని ఆగ్రహము నొంద వచ్చునే?

ద్రోణః— పితామహా! మాయలుక యంతయు నీ పలుకులు వినినతోడన పోయెను. మీఁదికార్య మాలోచించుట యుక్తము. అర్జునుఁడు ధర్మవిదుఁడగు ధర్మజునిచే శిక్షితుఁడు. అట్టివాఁడు సమయ మతిక్రమింపక బయలుపడి యుండఁడని నావిశ్వాసము. దానిని నిరూపింపఁ గురువృద్ధుఁడ వగు నీవ యర్హుఁడవు.

భీష్మః— రెండవ యేఁట నొక్క యధిక మాసము వచ్చెను. ఇట్లెక్కిన యానెలలఁ గూర్చిన నిన్నటితో వీరి యజ్ఞాతవాస సమయము నిండెను. అయినను. ఎదుటివారు యుద్ధసన్నద్ధులై వచ్చియుండ వెనుదీయుట క్షత్త్ర ధర్మము కాదు. కాఁబట్టి మనము రణమునకు సంసిద్ధులము గావలయుట యుక్తము. సంధి యొనర్చుకొనుట అంతకంటె యుక్తతరము.

సుయోధనః— నేను పాండవ హననమునకై యీశ్వ రాజ్ఞను జనించినవాఁడను. కాఁబట్టి వారితో సంధికొడఁబడఁ జాలను. యుద్ధ మొనర్చుటయే కర్తవ్యము.

ఆవల వారు చేయునది లేక యుద్ధ సన్నద్ధులై నిలిచిరి. అర్జునుఁ డాచార్యులకు నమస్కారబాణము లర్పించి శాత్రువులతో యుద్ధముసేయ సాగెను. కౌరవులు ఉత్సాహ పూరితులయి

యుద్ధము చేయుచుండిరి. ఒంటరిగాని జయించుట కష్టమా యను కౌరవ సైనికులలోని వీరులును జయశీలుఁడగు తనకు వీరేపాటివారని యర్జునుఁడును దలఁచుచుండిరి. జయ మేవంకను గలుగు ననుట నిశ్చయింప వీలుగాకుండెను.

ఈలాగున ఒకరికొకరు తీసిపోవక యుద్ధము జరుగుచుండఁ గ్రమక్రమముగా అర్జునుని బాణవేగమతి శయించుచుండెను. పార్థుని పరాక్రమ మధికముగు కొలఁదిని గురువీరుల శౌర్యము దఱుగఁ జొచ్చెను. విజయుని శరవేగమున కాఁగఁజాలక కురుసేన పసులఁ దోలుకొని వెనుదిరిగి యరుగ నారంభించెను. ఇది గాంచిన యర్జునుఁడు సుయోధనుని బిలిచి;

అర్జున — సుయోధనా! భీతిని సేనన కెట్లురిగిన నీ కవమానము లేదా? ఇట్లైన నీకు రాజ రాజ బిరుదము దక్కఁ గలదా? నల్వురువిన్న నగుబాట్లగుదను చింతనైన లేకున్నదే? ఇట్టి భీతుఁడ వింటనే యుండక తగుదునని రణాంగణమున కేల వచ్చితివి?

ఇది వినిన సుయోధనుఁ డత్యంత క్రోధావిష్టుఁడై వెనుక మరలి పోవుచుండు తనసేనల నుత్సాహ వాక్యములఁ బురికొల్పెను. సుయోధనుని పలుకులచే ద్విగుణితోత్సాహులగు సైనికులు మరల యుద్ధముసేయఁ జొచ్చిరి. పార్థునకును గౌరవ బలమునకును ఘోర సంగ్రామము జరుగుచుండెను. అంతఁ బాండవ మధ్యముఁడు శాత్రవులపై మోహనాస్త్రము ప్రయోగించెను. కౌరవులు దాని దాఁకున మూర్ఛితులయిరి. అర్జునుఁ డుత్తరకు బొమ్మ పొత్తికలకై భీష్ముని వంగనక్కఁ

దక్షిణ వారి శిరస్త్రాణములను ఉత్తరుని మూలమునఁ దెప్పించెను. పసుల మరల్చుకొని పార్థుఁడు నగరాభిముఖుఁడై చనెను. అవలఁ గొంతవడికి మూర్ఛదేఱిన కౌరవులు విషణ్ణ హృదయులై హస్తిపురాభిముఖులై వెడలుచుండిరి.

సుయోధనుఁ డీలాగున పరాజయము గలుగుటచేఁ దనతోఁ బాటున్న సుకులు వారికి నెల్ల స్వప్రయోజనపరతచే నేర్పడిన కల్లమాటలయి యుండునేమోయని సంశయించెను, అలాగున వారు దన్ను బిలచి యసత్యము లాడినవారికి లాభమేమిటి గలదు? కాబట్టి అవి యథార్థములే యగును. ఎదుటి వారికి ఇంచుక జయము చూపినఁగాని వారు దమతో రణమునకు డీకొనరు. వారు యుద్ధమునకు వచ్చినఁగాని దమకు జయము గలుగదు. కావున భారతయుద్ధ మారంభమయి అందుఁ దమకు జయము గలుగుటకై, ఎదుటివారిని యుద్ధానకుఁ బురికొల్ప నీశ్వరుఁడీలాగునఁ వారికి గించిజ్జయము గలిగించి యుండనోపునని తలఁచి యుత్సాహముతోడన వెడలెను.

---

## సాయము కుదిర్చికోలు

"ఆహా! పాండవులకు విరాటుని సహాయ మొనఁగూడెను గదా! యాజ్ఞసేని మూలమునఁ బాంచాలుఁడును, కృష్ణుని మూలమున యదువృష్ణ్యంధకాదులును గూడుదురు గాని ఇంకెవరు వారికి సాయపడఁజాలరని తలఁచి యుంటిని. ఇప్పు డుత్తరా వివాహ మూలమున విరాటుఁడు వారికెంతయుఁ

దోడ్పడెను. ఇంక నే నూరకుండుట సరి కాదు. చిన్న పాము నైనను బెద్దకఱ్ఱతోఁ గొట్టుట మేలగును. ఇంక నాకును దగినంత సాయము గుదుర్చుకొనుట కర్తవ్య మగుచున్నది.

ఇప్పుడు కృష్ణుని నా వైపునకుఁ ద్రిప్పుకొనుట మేలగును. అట్లని యదువృష్ణ్యంధకాదులు నాకు వశవర్తులు కాఁగలరు. కాని పాండవ పక్షపాతి యగు వాసుదేవుని నా వైపునకు ఎట్లు త్రిప్పుకొనుట యనునంశ మాలోచనీయము. ఇప్పుడు పాండవులు యుద్ధమునఁ దమకుఁ దోడ్పడ వలయునని అతనిని ప్రార్థింప వత్తురుగదా? అంతకుమున్ను నే నరిగి అతని నాకు సాయపడులాగున వేఁడుకొనెదను. అతఁడు మొదటి వేఁడుకోలు నా దగుటచే దీనిని ద్రోసి పుచ్చఁజాలక నా వైపు మఱలును. 'నే బాండవ పక్షపాతి యగుటచే రా'నని యాడునే? బాంధవ్యమున మే ముభయులము సమానుల మగుచుండ బహిరంగముగా అట్లాడఁ జాలఁడని తోఁచెడిని. ఎట్లును నే నాలసించుట దగదు."

అని ఈ లాగునఁ దలపోసి సుయోధనుఁడు సారథిని బిల్చి తేరు బూన్ప నియోగించెను. దివ్యాభరణాలంకృతుఁడై రథమునెక్కి ద్వారవతి కరిగెను. కృష్ణుని మందిరము చొచ్చెను. వాసుదేవుఁడు నిద్రించుచుండెను. కాఁబట్టి సుయోధనుఁ డాతని శిరము వైపు గూర్చుండెను. అంతఁ గొంతవడి కర్జునుఁడు వచ్చి హరి నిద్రించుచుండుటఁ గాంచి అతని పాదములకడ నిలుచుండెను.

నిద్రమేల్కొన్న దేవకీతనయుఁ డాదిని అర్జునుని గాంచి కుశలప్రశ్న గావించెను. పిమ్మట వెనుదిరిగి సుయోధనుని జూచి యోగక్షేమము లారసెను. వారి రాకకుఁ గారణము దెలియఁ గోరి ;

కృష్ణ:— మీ రిరువురు నిచ్చటి కేల వచ్చితిరో తెలుపుఁడు. నాచేఁ గాఁదగిన దేదేనుండినఁ బూర్తిగావించెదను.

సుయోధన:— మాకును పాండవులకును యుద్ధము జరుగఁ బోయెడిని. అట్టియెడ నీవు మాపక్షమునఁ జేరవలయు నని కోరెదను. ఈ కార్యము నుద్దేశించియే నే నిచ్చటికి వచ్చినాను. మున్ను నీయొద్దకు వచ్చినవాఁడను నేనుగాని యితఁడు గాఁడు. నీకు మే మిరువురము సమానులమే కదా!

కృష్ణ:— నీవిచ్చటికి మున్ను వచ్చుట యథార్థము. నేను పార్థుని మున్నుఁ జూచితిని. కాఁబట్టి మీయిరువురకును దోడ్పడవలయుట నాకు విధి యగుచున్నది. ఇందులకుఁ దగు విధానము సెప్పెదను వినుఁడు. నాతో సమానులగు వారు నారాయణాభిధానులు పదివేవురు గోపాలురు గలరు. వారొక వైపున సాయుధులయి యుద్ధము సేయువారు. నేనొక వైపున నిరాయుధుఁడనై రణ మొనర్పక యూరకుందును. ఈ రెంట నెవ్వరి కేది ప్రియమగునో కోరుకొనుఁడు. మీలోఁ జిన్నవాఁడు మున్ను గోరుకొనుట న్యాయము. అర్జునా! నీవు చిన్నవాఁడవు కాఁబట్టి ప్రథమమునఁ గోరుము.

అర్జున:— బావా! నాకు నీకంటె నన్యుఁడు వలదు. నీవు చెంతనుండినచో నాకు విజయము గలిగిన లాగుననేయగును.

ఇది వినిన సుయోధనుఁ డీలాగునఁ దలఁపఁ జొచ్చెను.

"కృష్ణునితో సమానబలులగు పదివేవురుండ వారి నంగీకరింపక నిరాయుధుఁడై యుద్ధవిముఖుఁడగు కృష్ణునీతఁ డంగీకరించుటలో ఏదేనొక మర్మముండవలయు నని తోఁచుచున్నది. వాసుదేవుఁడు పూర్వమే వానికిట్టిబోధ యొనర్చి యుండునే? అదెట్లు సంభవించును ? ఇప్పుడే కదా నేనీతనిఁ దోడ్పడ రమ్మని వరించితిని ! కాఁబట్టి ఆ యూహ సరి కాదు. దేవాంశ సంభూతులగు పాండవుల వధింప నీశ్వరుఁడు నన్ను సృజించెననికదా యసురు లాడియుండిరి ! దానికిఁ దగు సహాయసంపత్తి వలయును. కావుననే ఈశ్వరుఁ డీతనికిట్టి బుద్ధి పుట్టించియుండ నోవును."

అని ఈలాగున నాలోచించుకొని కృష్ణు నాలోకించి;

సుయోధన:—ఇంక నేను గోరుకొనవలసిన యవసరము గాన్పించుటలేదు. శేషించినవారలు నావారలే యగుదురు.

కృష్ణ:—ఆహా ! ముమ్మాటికిని వారు నీవారలే. అందులకు సందియమేమి? ఇదె వారలను బిలిచి నీవశము గావించెదను.

అని తత్క్షణము వారల రావించి సుయోధనున కర్పించెను. వారిని దోడ్కొని రారాజు బలరామునిచెంత కరిగెను. రాముఁడు దనశిష్యు నాశీర్వదించి యాదరించెను. సుయోధనుఁడు వచ్చినకార్య మాతనికి నివేదించెను. బలభద్రుఁ డదివిని ;

బలరాముః—వత్సా! అభిమన్యుని వివాహ సమయమున ఆసభలో నేనొక్కఁడ నీపక్షము బలికిన వాఁడను. తక్కినవారలు పాండవ పక్షపాతులై నామాటల కసహ్యపడి ప్రతికూల వచనములాడిరి. కృష్ణుఁ కవి ప్రియములయి యుండెను. నేనతని వీడి ఒక్క నిమిషమే నుండఁజాలను. అతనికిఁ గష్టము దోఁచులాగునఁబలుక నొల్లను. కాఁబట్టి ఒక నిశ్చయము చేసికొంటిని.

సుయోధనః— గురువరేణ్యా! అది యెట్టిదో సెలవిండు.

బలరాముః—మీరును వారును బోరునప్పుడు ఎవి యెట్లున్నను నేను పలుకకుండులాగున నిశ్చయించుకొంటిని.

సుయోధనుఁ డామాటలు విని ఎవ్వరును ఎవరి పక్షమునఁ జేరకుండెను గదా యని సంతసించెను. బలదేవుని వీడ్కొనెను. కృష్ణదర్శనపాలికిఁ బోయెను. తన యాగమన ప్రయోజన మాతని కెఱుక పఱచెను. అతఁడు గొంతసేనం దోడ్కొనివచ్చి సుయోధనునకు సాయపడెనని పలికెను. అంత నారాయణగోపాలగణము వెంటఁబెట్టుకొని కౌరవేశ్వరుఁడు హస్తిపురమున కరిగెను.

# మిత్రభేదము

పాండవులు శల్యునకు దూతనంపుట కౌరవేశ్వరుఁడు దెలిసికొనెను. శల్యుని బల మెఱిఁగిన వాఁడగుటచే వానిఁ దనవశము గావించుకొనుట కుపాయ మాలోచించుచుండెను.

“శల్యుఁడు మాద్రేయులకు మామ కాఁబట్టి వారి యెడఁ బ్రీతి యుండవచ్చును. కౌంతేయులపై వానికేల ప్రియ ముండును? కాఁబట్టి వాని స్వాధీనము గావించుకొనుట అంత కష్టములోనిది కాదని భావించెను. శల్యుఁడు వచ్చుమార్గ మునఁ దగువారల నియోగించి ఆతనికి సుఖవసతు లేర్పఱ చెదను. దానిమూలమున అతఁడు మనయెడ ననురక్తుఁడు కాఁగలఁడు. మామననుసరించి మేనల్లుఁడును మనపక్షము నవలం బింపవచ్చును. అప్పుడు ధర్మపుత్త్రుని పక్షమంతయు శిథిలిత మగును. రాజనీతి దెలిసినవాఁ డెల్లప్పుడును శాత్రవులయెడ మిత్రభేదము గావింప వలయునది. అట్టివాఁడు గాని జయ మును బొందనేరఁడు.”

అని ఈ లాగున నాలోచించిన రాజరాజు సమర్థులగు పరిజనుల రావించెను. శల్యుఁడు వచ్చుమార్గమున సర్వ సౌఖ్యము లతని కమర్పవలయున దని వారి కాజ్ఞ చేసెను. గూఢాకారముతోడఁ దానును వారి ననుసరించి వచ్చు చుండెను. శల్యుఁడు దన కాలాగున మార్గమధ్యమున సర్వ సౌఖ్యము లబ్బుట కబ్బురపడెను. అంత నాతఁడు దన పరి జనులఁ బిలిచి;

శల్యు:— ఈలాగున మనకు వలయువాని నెల్ల సమ
కూర్చునంతటి సమర్థుఁడగు యుధిష్ఠిరు సమాత్యుఁ డెవ్వఁడయి
యుండును? వాని నారసి దోడ్కొని వచ్చునది. వాఁడు నా
యనుగ్రహమునకుఁ బాత్రుఁడు కావలయును.

మాఱువేసమున నుండు సుయోధనుఁ డామాటలువిని;

“ఇది నే నాతని సందర్శించుటకుఁ దగు సమయము.
ఇప్పుడు నే బయలువడిన నా కోరిన కార్యము పూర్తి గావిం
చును. మద్రరాజు, అనుగ్రహింతునని వచించి వెనుదీయు
నంతటి నీచుఁడు గాఁడు. ఆడినమాట తప్పఁడు”

అని తలఁచి యాతని యెదుటి కరిగెను. శల్యునిపరిజను
“ఈతఁడే మన కన్నివసతు లేర్పఱిచిన వాఁ”డని తెలిపిరి.
శల్యుఁడు వానిఁజూచి సంతసించి,

శల్యు:— ఓయీ! నీకేమి కావలయునో కోరుకొమ్ము.
తప్పక నే దాని నిత్తును. నే నెప్పుడును అసత్యమాడు వాఁ
డను గాను. నాచే వరము వడసిన మీ రా జెప్పుటఁ గోపిం
చునో యని తలఁపకుము. దీనిమూలమున నీవాతని యనుగ్రహ
మునకుఁ బాత్రుఁడవు గాఁజాలవు. ఇది నిక్కము. నా పలుకుల
విశ్వసింపుము.

సుయోధన:— మద్రేశ్వరా! నీవు సత్యవాదివి. ఎట్టి
యిక్కట్టు గలిగినను ఆడినమాట తప్పని వాఁడవనుట నే
నెఱుఁగుదును. నా కోరు వరము నడుగుటకు మున్ను సన్నుతిఁ
గించు కొనెదను. వినుము. ఎవ్వఁ డభిమాన ఘనుఁడగుటచేఁ
దన కవమానము గల్గించిన పాండవుల, నజేయపరాక్రములని

వాసిఁగాంచిన వారల నడవులఁ గడు నిడుములఁ బడులాగునఁ
జేసెనో? ఎవ్వఁడు రాజరాజ బిరుదాంకితుఁడై రాజులనేకులు
దన్నుఁ గొలువ సింహాసనాసీనుఁడై, ప్రజలఁ బుత్త్రి నిర్వి
శేషముగఁ బాలించుచుండెనో; ఎవ్వఁడు వైష్ణవ యాగము
చేసి, ధారుణీసురులఁ దనియించి ధన్యతఁగాంచెనో; ఏవాఁడు
కౌరవజ్యేష్ఠుఁ డగుటచే న్యాయబద్ధముగు రాజ్యపాలనమున
కర్హుఁడై, అక్రమముగ రాజ్యభాగముఁగోరి తనతోఁ గయ్య
మునకుఁ గాలు త్రవ్వనున్న పాండవుల నమయించి లోకమున
న్యాయమును నిలుపనెంచెనో; అట్టి సుయోధనుఁడు నీకిప్పుడు
పరిచారకుఁడుగ నిదె యున్నవాఁడు. వీని ననుగ్రహింపుము.
మద్రనాథా! ఇప్పుడు నీకుఁ బరిచర్య లొనర్చువారు నా పరి
జనులు. వారెట్టి లోపములు సేయకుండు లాగున ఈ వేసమున
వచ్చి చూచుకొనుచుంటిని. పాండవుల తోడ నా కనివార్య
మగు యుద్ధము తటస్థించి యుండుట నీ యెఱిఁగినదే కదా!
నాకుఁ దగుమంత్రి యొక్కఁడు గావలసెను. అట్టివాఁ డిప్పుడు
జిక్కఁగలఁడని యాలోచించుచుండ నీవు స్మరణాగ వచ్చితివి.
అంత నీకు దూతనంపఁ దలఁచితిని గాని నీవిటు వచ్చుచుండుట
దెలిసెను. నీ మనసు పాండవులనుండి మఱలింప నెంచి ఈ
వేస మూనవలసెను. అది యిప్పుడు సఫలమయ్యెను. పాండ
వులకై పనిసేయు నరుగువాఁడు నాపక్షమంగీకరించుట సరియా
యని తలఁచెదవు గాఁబోలు? నీకుఁ గౌంతేయులు మేమును
ఒక్కరూపు వారమే. ఇఁక మాద్రీ తనయులను గుఱించి
కదా నీవు వారితోఁ గూడవలయును? నకుల సహదేవుల

సోదర నిర్విశేషముగా నేఁ బ్రోచెదను. వారిని నాతోఁ జేర్పుము.

ఈమాట లాలకించిన శల్యుఁ డతి విస్మితుఁడై యీ లాగునఁ దలఁపఁ జొచ్చెను.

"ఔరా! సుయోధనుని రాజనీతి పాండిత్యము! శత్రుపక్షమును ఎంతలో భేదింపఁ జొచ్చెను? నా యట్టి వాని నీతఁడు వలలో వైచుకొనుట ఈతని సామర్థ్యమును బ్రకటించు చున్నది. కానీ! ఇంక నేమి సేయఁగలను? ఆడినమాట తప్పు టుచితము కాదు. ఈతని పక్షముననే చేరవలసి యున్నది. ఈ విషయమున సుయోధను నం దావంతయు లోటు లేదు. అతఁడు రాజనీతి విశారదుఁడు. కాబట్టియే ఇట్టి మిత్రభేదము గల్పింపఁగలిగెను. ఇట్లాచరించుట యాతని కుచితమే యగును. అయినను నేను వంచితుఁడ నగుట యదార్థమేకదా! నమ యము చూచి వంచనకుఁ బ్రతివంచన గావించెదను. ఆ లాగునఁ జేయుట దోషావహము కాదని నాయభిప్రాయము."

అని తలఁచి సుయోధను నుద్దేశించి:

శల్యః— సుయోధన రాజేంద్రా! నీవు నుడివినలాగున నాకుఁ గౌంతేయులు నీవును ఒక్క రూపువారలే. కాఁబట్టి నేను నీ యిచ్చచొప్పున అమాత్య పదవి నంగీకరించితిని. మాద్రేయుల మఱల్చుట నాచేఁగానిపని. కాఁబట్టి ఆ ప్రయత్న మును మానుము. వారును ఇది మొదలు నాకు శాత్రవకోటి లోని వారలే. క్షత్రియునకు రణరంగమునకు వచ్చినపిమ్మటఁ దండ్రియైనను గుమారుఁడైనను గురువైనను ఎదుటి పక్షము

వాఁడు సంహరింపఁ దగినవాఁడే యగును. అట్టుండ వారిని మన పక్షమున కేల పిలువవలయును? పిలిచితిమిపో! వారేల మన పక్షమునకు రాఁగలరు? యాజ్ఞసేనియట నేవుర నొక్కటిగాఁ జేర్చి బంధించియున్న దనుట మఱచితివి గాఁబోలు! వారు రాకున్న మనకిచ్చటఁ గలుగఁబోవు లోటేమిటి?

సుయోధన:— అరుల పక్షము శిథిలమగుట మన కనుకూల మగునది కదా!

శల్య:—నీవు పలుకునది వాస్తవమే. అయినను అది దుర్ఘటము. ఇంక నీవాచింత మానుము. నాకు సెల వొసఁగుము. పాండవుల పిలుపుపై వచ్చినవాఁడ నగుటచే వారిని గాంచి 'నేను సుయోధనపక్ష మవలంబించితి' నని వచియించి హస్తినకరుదెంచెదను. నీవిఁక సంశయింపకుము.

సుయోధనుఁ డాతనిమాట చొప్పున అతనికి సెల వొసఁగి తాను దనపరివారముతో హస్తినకు వచ్చెను. కిరాతాది సైన్యములతోడ భగదత్తుఁడును, భూరిశ్రవుఁడును వచ్చి కౌరవులతోఁ జేరిరి. కాంభోజాధీశుఁడగు సుదక్షిణుఁడు ఇంకఁ బెక్కురు రాజులు దమసేనలతోడ వచ్చి వారి పక్షమునఁ జేరిరి.

# శ్రీకృష్ణునిరాయబారము

కర్ణా ! నాతండ్రి వృద్ధుఁడగుటచేఁ జిత్తస్థైర్యము లేక నాబలఁగము విషయమున నేనెంత చెప్పినను నమ్మక నామాటలెల్లఁ గల్లలని భావించుచున్నాఁడు. మొన్న సంజయుని మాటలువిని కృష్ణుఁడొక వీరవరుఁడని భావించి నన్ను బిలిచి యుద్ధ మాపమనెను. రాజగువాఁడు దనమాటలఁ దాను జెల్లింపఁజాలని యెడల వానిని ఎవరు సరకు సేయుదురు ? కృష్ణుఁడుండు వైపుననే జయము గలుగునఁట. కృష్ణు నంత బలముగలవారు సాయుధులు నారాయణ గోపాలురు పదివేవురున్నారని నే నాడిన నామాటల యందు విశ్వాసరహితుఁడై మరలమరల వారికే జయము గలుగు ననుచుండును.

కర్ణ:—సుయోధనా ! ముదుసలి మాటల కేమిగాని యుద్ధమును మాత్ర మాపఁజూడకుము. సంధికొడఁ బడకుము.

సుయోధన:—నేనేల యంగీకరింతును ? పాండవుల సంహరించుటకై ఈశ్వర ప్రేరితుఁ డగువాఁడను ఆవని సేయక మిన్నకుందునే?

అని పలికి సోదరబృందముతోడను; మిత్రవర్గముతోడను సభాభవనమున కరిగెను. వీరికిమున్నే ధృతరాష్ట్రుఁడు భీష్మాది వీరులతోడ నచ్చటికివచ్చి యుండెను. శ్రీకృష్ణుఁడు సాత్యకితో ఆ సభాభవనమునకు వచ్చెను. నారదాది ముని బృంద మాప్రదేశమున గరుదెంచెను. అప్పుడు కౌరవులచే యథావిధిగాఁ బూజితుఁడైన వాసుదేవుఁడు ధృతరాష్ట్రు నవలోకించి ;

కృష్ణ:— రాజేంద్రా! నీయెఱుఁగని ధర్మములు లేవు. క్షీరనీర న్యాయమునఁ బాండవులును నీసుతులును గలిసి మెలసి యుండుట శ్రేయస్కరమగును. నీపుత్రుఁడు కర్ణాదుల మాటలు విని చెడిపోవుచున్నాఁడు. వాని యిష్టము చొప్పున నరిగినఁ గష్టములు గలుగును. వృకోదరార్జునులు యుద్ధరంగమున నిలిచిన వారిని మీవారలలో నెవ్వరెదురింప నేర్తురు?

దుశ్శాసన:— కృష్ణా! నీ విపుడు దూతకృత్యము నేయ వచ్చిన వాఁడవు. కాఁబట్టి వారిమాటలఁ జెప్పవలయునే కాని నీ యభిప్రాయములు బయలు పెట్టుట కిది సమయము కాదు.

సుయోధన:— వత్సా! ఇట్టిసమయమున నీ వీలాగునఁ బలుకుట తగదు. అతని ధోరణి యంతయు కానిదే నీవు నడుమనచ్చి అడ్డుపలుకుట దగునా?

కృష్ణ:— బాలుఁడయినను దుశ్శాసనుఁడు లెస్సగాఁ బల్కెను. నీబోటి వారలుండు నెడ నావచ్చిన విషయము చెప్పక యన్యము వచించుట తగనిదగును.

సుయోధన:— కృష్ణా! నీవేల యీలాగున అగ్రహించెదవు?

కృష్ణ:— ఇది యాగ్రహోక్తి గాదు.

సుయోధన:— అది యటుండనిమ్ము. నే నొకమాట యడిగెదను. దానికి సరియగు సమాధాన మీఁగలవా?

కృష్ణ:— రాజరాజవగు నీవడిగినఁ జెప్పకయుండుట సాధ్యమగునే?

సుయోధనః:— ఈ చతురోక్తు లింకఁ జాలింపుము. నీవు మాయొద్ద కరుదెంచిన వాఁడవుగదా ? బాంధవ్యముచేఁ బాండవులతో సమానులగు మాయింట భుజింపక విదురునింటి కేల యరిగితివి ?

కృష్ణః—పగవాని యన్నము భుజింపరాదు. పగవానిఁ బిలిచి తనయింట నన్న మిడఁగ రాదు. నీవు బాల్యమునుండి పాండవుల ద్వేషించుచున్నావు. వారు నాకుఁ బ్రాణముల వంటి వారు. తను ప్రాణములపైఁ బగఁ గొన్నవారు ద్వేషులగుటచే నీవు నాకు శాత్రవుఁడవు. అట్టి నీయింట యన్నము దినుట యుచితము కాదు.

సుయోధనః:— నీ కింతటి ద్వేషము గలదనుట నేఁడు గదా తెలిసికొంటిని !

కృష్ణః—నీ, ఇంక ఈలాటి వృథావచనములతోఁ బ్రొద్దుపుచ్చఁ జాలను. వచ్చినపని చూచుకొనవలయును—ధృతరాష్ట్రరాజన్యా ! పాండవులు నాముఖమున నీకుఁ దెలుప మనిన దానిని వివరించెదను. దత్తావధానుఁడవై వినుము.

ధృతరాష్ట్రః—నాబిడ్డలు కానలఁ బలుగడగండ్లుపడి ఎట్లో విరటుని పాలికిఁజేరి సుఖించుచున్నారని విని ఎంతయు నలరుచున్నాను. ధర్మాత్ములగు ధర్మజాదు లిట్టి కష్టములు గలుగుటకు దైవమే కారణము. ఎన్నియిడుములు గలిగినను భీమార్జును లన్నమాటకు లోఁబడి వాని నోర్చియుండుట వారి మహానుభావతను బ్రకటించుచున్నది. వనికూనలు

పాప మామా(ద్రీసుతులు అరణ్యవాస క్లేశమును ఎట్లనుభ వించిరో కదా!

అహా! నాకోడలు (ద్రౌపది ఎట్టి ధర్మస్వరూపిణి! అట్టి యనువ్రత చెంతనుండుటం బట్టియే వారేవురు గానల నున్నను నగరవాసులకంటె సుఖముగాఁ గాలము గడుపు చున్నారు. వారికి నాయెడఁ గలభక్తి చెప్పనలవికానిది. కృష్ణా! ఆలసింపక వారాడిన మాటలు వచించి నాచెవులఁ దనియింపుము.

కృష్ణః—వినుము వారి మాటలు. "మీవంపునన పన్నెండు వత్సరములు గానలఁ గడిపితిమి. పదమూఁడవ యేఁట నజ్ఞాతవాసము చేసితిమి. ఇఁక మాతం(డిసొమ్ము పడ యుట న్యాయహితము. మా యర్ధరాజ్యము మీవలనఁ బడయఁ గలుగుదుమని కృతనిశ్చయులమై యున్నారము. మా కెల్ల చుట్టములు మీరె యగుదురు. ఎప్పటికైన మిమ్ము గాక యొరుల నమ్మువారము గాము. మన కులముపాడి చెడకుండఁ గాపాడుఁడు." అని నీకుఁదెల్పుమనిరి. దీనికి నీవేమి బదులు చెప్పెదవు?

అప్పు డాసభలోనికి వచ్చియుండిన మహర్షుల మధ్య మునుండి జామదగ్న్యమహాముని సుయోధనుని గాంచి;

జామదగ్న్యః—సుయోధనా! గర్వ మెట్టివానికిని బనికిరాదు. గర్వితుఁ డగుటచేఁ గదా పూర్వము దంభో ద్భవుఁడు నరునిచేఁ బరాభూతుఁ డయ్యెను? అనరనారాయణులే

ఇప్పుడు కిరీటియుఁ గృష్ణుఁడునై యవతరించి యున్నారు. వారలతోడి విరోధము నీకుఁ దగదు.

కణ్వ:—జామదగ్న్యుని పల్కులు సత్యములు. తన్నును ఎదిరినిని ఎఱుఁగక నిగ్రహింపఁ జూచుట తగనిపని. అహంకారము పౌరుషమును నాశము గావించును. కాఁబట్టి ఎంతటి బలవంతున కేని గర్వము సరి కాదు.

నారద:—కౌరవనాథా ! వీరిమాట లత్యంత విశ్వాసార్హములు. ఎట్టివాని కేని దుర్మానము దగదు. అది దుర్దశకు మూలము. కాఁబట్టి నీవీకృష్ణుని పలుకుల నాదరించవలెను. ఇతఁడు సామాన్యుఁడని భావింపకుము. తలఁచినమాత్రాన లోకముల దహించునంతటి మహిమ గలవాఁడు. సత్త్వస్వరూపుఁ డగుటచే నిన్నిలాగున బ్రతిమాలుచున్నాఁడు. నీవలని భీతిని బలుకుట లేదని తెలిసికొనుము.

సుయోధన:—మహర్షి పుంగవులార ! ఎట్టివానికి విధి యలంఘ్యము. ఒకొక్కరు గొప్ప కార్యము లాచరించుటకుఁ గాదె భగవంతునిచే సృజింపఁ బడుచున్నారు ! అట్టియెడ వారు దమకార్యములఁ దీర్చకుండుట యెట్లగును ? వారి యవతార కార్యము వారు తీర్పనెంచిన లాగున నా జనన ప్రయోజనము నేఁ దీర్పవలదా ? కాఁబట్టి మీరీ విషయమున జోక్యము గలిగించుకొనకుఁడు.

ధృతరాష్ట్రః:—కృష్ణా ! వీఁడెవ్వరి మాటలును విన కున్నాఁడు. నీవేనించుకశ్రమ తీసికొని దారికిఁ బడఁ జేయుము.

కృష్ణ:—సుయోధనా! గొప్పవంశమున జనించితివి. సకలగుణ సంపన్నుఁడవని వాసిఁ గాంచితివి. అట్టివానికి నీకిట్టి దురాగ్రహము తగునా? నీ యీచేత ఈసభలోని వారి కెవ్వరికిని సమ్మతము గాకున్నది. బహుజన విరోధము కష్టముల కాకరమని తెలియవా? కాఁబట్టి పాండవుల రావించి వారి యర్ధరాజ్యము వారి కర్పించి కీర్తిపడయుము.

భీష్మ:—పాండుసుతులతో నీకు వైరము దగదు. వారు దైవమానుష బలములు రెండును గలవారు. అట్టివారి నెదిరించుట సమంజసము కాదు. ధృతరాష్ట్రుఁడు జీవించి యుండఁగనే రాజ్యము, యశస్సు, బంధువులు, ఇది యవి యననేల? సర్వము నేల నాశము గావించు కొనెదవు? వృద్ధుల మగుటచే మామాటల నాదరించిన నీకు మేలు గలుగును.

ధృతరాష్ట్ర:—కుమారా! కృష్ణుని మాటల నాదరింపుము. పెద్దల పలుకుల గౌరవింపుము. నీకు సర్వశుభములు గలుగఁగలవు.

ద్రోణ:—ధర్మసుతుఁడు సర్వజ్ఞశ్రేష్ఠుఁడు. అట్టివానిని నీవు తిరస్కరించుట నిందాస్పదము. అతఁడు నీపై నెంతయుఁ బ్రీతి గలవాఁడు. వానితోడి చెలిమిని నీరాజ్యము స్థిరపడఁ గలదు.

సుయోధన:—కృష్ణా! ఆచార్యులును బితామహులును నాతండ్రియు నన్ను ఎల్లప్పుడు దూఱుచుందురు. నీవును వారి లాగుననే నను దూషింపఁగడఁగితివి గాని న్యాయము నారయ వైతివిగా! మీరు పాండవులను అరణ్యవాసులఁ గావించి

పెక్కుడుములఁ గుడిపించితి నని నన్ను దూషింతురుగాని అందు నావలని నేర మావంతయు లేదని తెలియరైతిరిగదా! జూదరి యగు ధర్మజుఁడు శకునితో జూదమాడి రాజ్యము నోడెను అది చాలక మఱల నాడి యోడి అడవుల పాలాయెను. ఇవి యెల్లను అతఁడు బుద్ధిపూర్వకముగాఁ జేసినవియే కాని నా నిర్బంధముననా యాచరించెను? తాను జూదమున నోడిన రాజ్యము మఱలఁ దనకెట్లు వచ్చుననుట యెఱుఁగక కేవల రాజ్యలోభమున విరాటాదులఁ బురికొల్పుకొని నాపై యుద్ధమునకు రానున్నాఁడు. ఎదుటివారు రణమునకు వచ్చినప్పుడు మేము సన్నద్ధులమై యుండుటయా యన్యాయము? ఒక వేళ, మాతండ్రి జూదమున నోడినవారికి మఱల రాజ్యము నిచ్చెను. గాఁబట్టి అది వారిది యగుననవేమా? జూదమున నోడిన దాని మఱలఁ జూదమున గెలిచిపొందవలయునే కాని ఇచ్చుట కాతఁ డెవఁడు? గ్రహించుటకు వీ రెవరు? చక్కఁగ నాలోచించిన నామాట న్యాయబద్ధ మగునదియుఁ గానిదియు నీ వెఱుఁగఁగలవు.

వికర్ణ:— మీరెట్లాడినను వారి యర్ధభాగము వారి కిచ్చుటయే సరియగునని నాకుఁ దోఁచెడిని.

సుయోధన:— నీవు కుఱ్ఱవాఁడ వగుటచేఁ దెలియక యాడుచున్నావు. జూదమున నోడుటచే వారు రాజ్యార్హులు గారనుట యటుండనిమ్ము. జననము మూలమునను వారికి రాజ్యార్హత లేదు. ఏలన? పాండురాజు మనతండ్రి యశక్తుఁ డగుటచే అతనికి బదులుగాఁ గొంతకాలము రాజ్యమును

బాలించెను. దాని మూలముననే అతని కొడుకు రాజు గాం జాలండు. అదియునుగాక పాండవునకు:వీరారసులుగారు. యమ సుతునకుం గౌరవుల రాజ్యమెట్లు రాంగలదు? అధర్మయుక్త మగు వీరిమాటల నమ్మి నీ విలాగున నాడుట దగదు.

కృష్ణః— నీ వలనం దప్పు లేదనికదా యూశితివి! బాల్యమునుండి పాండవులయెడ నీ వాచరించిన కార్యములు నే నెఱుంగనని తలంచితివా? ఎత్తివిడిచిన వారని ఎల్లతప్పులు వారిపై మోపం జూచెదవా?

దుశ్శాసనః— అన్నా? తండ్రియు భీష్మాదులును జేరి ఈ కృష్ణునకు మిమ్మప్పగింపం దలచి యున్నలాగునం దోంచు చున్నది. మీ రిట్టి సభనుండుట న్యాయముగాదు. లెండు. ఇటనుండి వెడలుండు.

సుయోధనుం డీమాటలు విని వెంటనే మాఱు మాటాడక యటనుండి వెడలెను. కర్ణాదులును అతనిని వెంట నంటి చనిరి. వీరీలాగున నరుగుట కా సభలోని వారెల్ల రేవగించుకొనిరి.

# మంత్రాలోచన

ఆలాగున సభనుండి యరిగిన సుయోధనుండు కర్ణా దులతోడ మంత్రాలోచనాగారము చేరెను. ఆల నెల్లరు నాసీనులయిరి. అంత సుయోధనుండు రాధేయుని గాంచి;

సుయోధన:—మిత్రమా ! వింటివిగదా మాతండ్రి యొక్క దురుద్దేశము ! కన్న కొడుకని కనికరమింతైన లేక కట్టడియయి ఆ విదురాదుల మాటలు విని నన్ను కృష్ణునకుఁ బట్టి యియ్యనెంచెనఁట. ఇది నీతిగర్హితమని యించుకైనఁ దలంపఁడుగా! జనకుని యానతి మీఱ రాదనికదా ఇంత కాలము నేను శాత్రవులొనర్చు దుష్కార్యముల నోర్చియుంటిని ? అందులకిది ప్రతిఫలము గాఁబోలును ! నీయట్టి వారు వృద్ధుని మాటల గణింపవలదని ఎంత చెప్పినను బెడ చెవిని బెట్టినందులకుఁ దగినలాగునఁ బ్రాయశ్చిత్తము జరిగెను. కన్న తండ్రియే యిట్లుండగా ఇఁక భీష్మాదుల మాట దలఁప నేల ? ఆచార్యులు మొన్నగు నీబ్రాహ్మణులు నాసొమ్ము తిని నాకే యపకారము సేయఁ దలఁచుచున్నారు. వీరెల్లరు నాయెడ నిట్లగుట కాలమహిమ గాకున్న నింకేమగును ?

కర్ణ:— నేరమొకచోట జరిగిన నింద మఱియొక చోటఁ గలుగుననుట వాస్తవము. కృష్ణుఁడు తన చాకచాక్యమున వీరి బుద్ధులెల్లను మార్పఁగలిగెను. దానిని నీవు దెలియక కాలముపై నారోపించుచున్నావు. గోపాలుని దుర్మంత్రప్రభావ మింతకుఁ దెచ్చెను. కాఁబట్టి ఇఁకనైన నామాటవిని వానిని బట్టి బంధించు టుచితము. లేకున్న వాఁడిఁక నెన్నియేని దుస్తంత్రములఁ బన్నుచుండును.

సుయోధన:—దూతను నిర్బంధించుట రాచపాడి గాదు గదా !

దుశ్శాసనః—అన్నా! ఆదినుండి నీవీలాగునఁ బల్కు-చుండుట చేతనే ఇంతయు పుట్టెను. దూతను హింసించిన దోషముగాని, మానభంగ మొనర్చుట పాపహేతువుగాదు. ఇంతకు నితఁడు దూతయే కాఁడని నాయభిప్రాయము. దూత దన కిచ్చిన పనిని నివేదించి బదులు విని యేఁగును గాని వీనివలె లోలోన మిత్రభేద మొనర్చు, బహిరంగముగాఁ దిరస్కరించి పలుకునా? కాఁబట్టి వీని బంధించుట యక్రమము గాదు.

శకుని:—సుయోధనా! చేతఁ జిక్కిన శాత్రవుని కృష్ణుని బట్టి బంధించుట యుక్తము.

సుయోధనః—కృష్ణుఁడు శత్రువుల దూతగాని శాత్రవుఁడు గాఁడు.

శకుని:—"వారు నాకుఁ బ్రాణములవంటి వారు. తమ ప్రాణములకైనఁ బగఁగొన్నవారు ద్వేషులగుటచే నీవు నాకు శాత్రవుఁడ" వని వాఁడే నుడివెను గదా? కాఁబట్టి శత్రుని జిక్కించుకొనుటయే యుచితము.

వికర్ణః— మీ దుర్మంత్రముల మూలముననే ఇంతయు పుట్టెను. ఇకనైన నీతిని మానకుండు గాపథమునఁ జొరనీయకుఁడు.

శకుని:— పానకములోని పుడకలాగున నీ వేల మాటి మాటికి నడ్డము వచ్చెదవు? నీకుఁ దెలియదు. ఒరులు చెప్పిన వినవు. ఇట్టివానికి పెత్తన మేల?

సుయోధనః— వత్సా! పెద్దవారి మానసములకుఁ గష్టము గల్పించుటయా తగవు?

వికర్ణుఁడు సుయోధనుని వంకకు నవలోకించి యిట్లని పల్కఁ
పోయఁ జొచ్చెను

"నేఁడిక మాటలాడిన యన్నగారికిఁ గోపమువచ్చును. పెద్దల మానసములు గలఁగించుట ధర్మము గాదు. కాఁబట్టి యూరకుండెదను. ఆదినుండి వీరి బుద్ధిని మార్చ నీశకుని రాధేయుఁడు దాఁపురమై యున్నాఁడు. ...కిఁ ద్రోహి కర్ణుఁడు దుర్బోధలు చేయుచున్నాఁడు. తక్కిన నా సోదరు లన్నగారు చెప్పిన తెఱఁగుననే పోవుచున్నారు. నే నొక్కఁడను ధర్మమును బాటించి ధర్మజుని పక్షమునఁ బలుకుచుండిన లాభ మేమియును గలుగుట లేదు. వీరికిఁ గృష్ణుని బంధించు ప్రయత్నమును మానరు. వీరి కాలాపన నాచరించుట సాధ్యము గాఁబోదు. దీని మూలమున ద్వేషము పెచ్చు పెరుఁగఁ గలదు. యుద్ధము తప్పక జరిగియే తీరును. జయము కృష్ణార్జునుల పక్షముననే కలుగఁ గలదు. ఇష్టమున్నను లేకున్నను ఇందెవ్వఁడ నేను రాజ్యమునకుఁ గడఁగవలసిన వాఁడనే? కానిమ్ము. 'సదాఖిలం బహుభిన్నహా' యనియెంది మదిఁ గుందుట పలుచకోనెదను గాక."

అని తలఁచుచు మిన్నకుండెను. శకుని సుయోధనుని విలోకించి ;

శకుని:— అలసింపక సభకేఁగి కృష్ణుని బంధింపుము. ఇదియే ప్రథమకర్తవ్యము.

అని యీలాగున వారు మంత్రాలోచన గావించి యటనుండి కదలిరి.

# సేనాపతి నిర్ణయము

సుయోధనుని బంధన ప్రయత్న మెఱింగిన కృష్ణుఁడాతని దూషించి సభా మధ్యమునుండి వెడలి పాండవులఁజేరి యచట జరిగినదెల్ల వివరించెను. వారలీమాటలు విని యుద్ధోన్ముఖులైరి. కృష్ణుఁ డర్జునునకు సారథి యయ్యెను. కురుక్షేత్రము నుభయులు రణరంగముగా నిర్ణయించుకొనిరి. రారాజు ద్రోణాదులను అక్షౌహిణీ నాయకులుగా నొనర్చెను. వారలతోడ భీష్మునిఁజేరి,

సుయోధన:—తాతా! తారకలకుఁ జంద్రునివలె నీవు కురువంశమున కెల్లమేటివి. కాఁబట్టి సర్వసైన్యాధిపత్యమునకు నీవ తగినవాఁడవు. ఈప్రార్థన మంగీకరింప వేఁడుచున్నాను. నామాట వ్యర్థపుచ్చకుము.

భీష్మ:—నాకుఁ బాండవులు నీవు నొక్కరూపు వారలే కాఁబట్టి నీమాటల కడ్డుపలుకనుగాని యర్జునుఁడు దక్కఁ దక్కినవారితో రణమొనర్పఁ జాలుదును. అతఁడస్త్ర విద్యలో నాకంటె మేటియగును.

సుయోధన:—మీయిచ్చ వచ్చిన లాగున జరుపుము. నీవు సర్వసైన్యాధిపత్య మంగీకరించుటయే నాకు ముఖ్యము. ఈ కర్ణాదులు నీకుఁ దోడ్పడఁగలరు.

భీష్మ:—కర్ణుఁడా నాకుఁ దోడ్పడఁగలవాఁడు? సుయోధనుఁడు! నీవిఁకను వానిపై నభిమానము వీడకున్నావు. కడమాట యొక్కటి వినుము. మా యిరువురిలో నొక్కఁడే యుద్ధము సేయవలయును నీకు వానిపైనంత మక్కువయున్న వానినే రణమున కంపుము.

కర్ణ:—మిత్రమా! భీష్ముఁడు పడునంతవఱకు నేను యుద్ధమాడనని ఇదివఱకే నీతోఁ జెప్పియుంటిని గదా! కాఁబట్టి యాతఁడే రణమొనర్పనిమ్ము.

సుయోధన:—నెచ్చెలీ! ఇవి శపథములు పలుకు సమయము గాదు. ఆగ్రహము మానుము. పితామహా! నీవ యాదిని యుద్ధమునకు వెడలుము. ఇఁకనైన సర్వసైన్యాధిపత్య మంగీకరింపుము.

భీష్మ:—అట్లేయొప్పుకొంటిని. ఇంక నొక శపథము గలదు. దాని నెఱిఁగించెదను వినుము. శిఖండి నాయెదుట వచ్చినచో నే రణమును మానుదును. ఇది నా వ్రతము. అలాగున వాఁడు రాఁడేని పాండవుల సేనలనే నొక్కఁడ సంహరింపఁ జాలుదును.

సుయోధన:—అలాగుననే చేయుము. ఇఁక రణరంగమునకరుగుదము. మున్నే యట మనకొఱకుఁ బటకుటీరములమర్పఁబడినవి.

అని యెల్లరును గురుక్షేత్రాభిముఖులై చనిరి.

# ద్వంద్వ యుద్ధము

“ఆహా! పరశురాముని నోడించిన భీష్ముఁడును, ఆచార్యులు నంతనుండ నాకేమి భయమని తలఁచియుంటిని. బలరామునివలన గదాయుద్ధ పాండిత్యము సంపాదించిన

నాకెదురెవరని కదా గర్వించియుంటిని ! దానికి ఫలమిప్పుడ కంటిని. నాసారథి రథము తొలఁగించి తీసికొనిరాకున్న భీముఁడు నన్ను యమపురి కంపి యుండును. ఇది నిక్కము.

కట్టా ! ఈసారథి ఎట్టి యుపకారము గావించెను. శత్రువుతోఁ బోరి జయముగాంచలేని నన్ను బ్రదికించి కలకాల మవమాన పాత్రుఁడగు లాగునఁ జేసెను. ఇన్ని దినములు నారథమున నున్నందుల కిదియా ప్రత్యుపకృతి?

ఇంతకు నాకాలము చెడ్డదగుటచే వీని కిట్టి బుద్ధి జనించెను. కాలమహిమ గాకున్న నాయట్టివాఁడు మూర్ఛ నొందుటయు, మహాబలశాలి యగు భీష్ముఁ డుదాసీనుఁ డగుటయుఁ దటస్థించునే? కానీ. గతమును గూర్చి వగచిన లాభమేమిటి ? జరుగవలసిన దానిని గదా యాలోచింపవలయును? భీష్ముని యశ్రద్ధయే ఇట్లగుటకు మూలకారణ మగుటచే నాతని మందలించెదను.''

అని తలంచుచుండిన సుయోధనుఁడు శాంతనవుని చెంత కరిగి ;

సుయోధన:—గంగాతనూజా! ముల్లోకము లొక్కటియై వచ్చి నిన్నుఁ దాఁకినను నీవొక్కఁడవే పోరి వాని జయింపఁ గలుగుదువు. అట్టివాఁడవు; నేను శత్రుశరముల తాఁకున మూర్ఛిలినపుడు సేనను జూచుకొనక యుపేక్షించుట చూడ నాశ్చర్యముగా నున్నది. అక్కటా ! ''నేను పాండవ పక్షపాతిని. వారితో రణ మొనర్పఁజాల'' నని నాఁడే చెప్పియుండ

రాదా! అప్పుడు నాకుఁ దోఁచినలాగున నే నాచరించి యుందును గదా!

భీష్మ:—కౌరవనాథా! పాండవుల పరాక్రమము నీకుఁ దెలియనిది కాదు. వారల జయించుట సులభసాధ్యమని తలఁచితివా? ఎంతయుఁ గష్టపడినఁగాని జయము గలుగఁ జాలదు. అది యటుండనిమ్ము. నే నిపుడే రణరంగమున కరుగుదును. నా యోపినంత పట్టున పాండవుల జయింపఁ జూచెదను. భీతుఁడవు గాకుము.

అని యాడినంత సుయోధనుని మనస్సించుక శాంతి నందెను. సేనలఁ బురికొల్పెను. శంఖధ్వానము గావించెను. భీష్మునితోఁ గూడి మఱల రణరంగమున కరిగెను. శాంతనవుఁడు శత్రుసేనల హతము గావించుచుండెను. సుయోధనుఁడు తిరుగ భీము నెదిరింప సమకట్టెను. తన వాఁడి నారసముల నాతని నొప్పింప సాగెను. వృకోదరుఁడు నిజశరముల సుయోధనుని వక్షమున నాటులాగున నేసెను. ఆతని సారథిపై బాణవర్షము గురిపించెను. కురుపతియుఁ గుపితుఁడై భీమసేనుని సారథిని బాణముల నొప్పించెను. ఒక శరమున నతనివిల్లు ద్రుంచెను. పవనతనయుఁ డంత వేఱొక విల్లుపూని గాంధారీసుతుని శరాసనము దునిమెను. రాజరాజు వేఱొక ధనువు నెత్తుకొని భీమునిపై బాణములు వేయ సాగెను. అతఁడు వాని మార్గమధ్యమునన ఖండించెను. అలాగునఁ దన బాణములు రిత్తలైపోవుట కాగ్రహము నొందిన సుయోధనుఁడు మఱలఁ గొన్నిటి నేసెను. భీముఁడు వానిని

గూడ నాలాగుననే త్రుంచివైచెను. అంత మండిపడుచుఁ గౌరవనాథుఁడు రెండు వాఁడియమ్ముల భీముని లలాటమును, నాల్గింట భుజములను, యెనిమిదింట వాని వక్షమును గాఢ నాట నేసెను. వీనితాఁకున కోర్వలేక భీమసేనుఁడు సొమ్మసిలి రథముపైఁ బడెను.

ఇదిగాంచిన ద్రౌపదేయులు నకులసహదేవులు నొక్కుమ్మడి సుయోధనునిపైఁ బడిరి. రారాజు వెనుదీయక వారితోఁ బోరుచుండెను. ఇంతలోన సేదదేరిన భీముఁడు సుయో ధనునితో యుద్ధముసేయురాఁగ శల్యుఁడాతని మార్కొనెను. పావని నిజబాణముల మద్రేశ్వరుని నొప్పించెను. అతని శర నిహతి తాఁగలేక శల్యుఁడించుక తొలఁగి చనెను. ఆ సమయ మున దుశ్శాసనాదులువచ్చి భీము నెదిరించిరి. సుయోధనుఁడు తాండవేయులఁ దనబాణముల సొమ్మసిలఁ జేసి తన సోదరు లకుఁ దోడ్పడ నరుదెంచెను. భీముఁడంతలోన సేనాపతిశిరము ద్రుంచి, జలసంధుని సంహరించి, సుషేణుని మూర్ఛా క్రాంతుని గావించెను. దుశ్శాసనాదుల బాణవర్షమున నొప్పించెను. భీముని యీ సేతలెంతయు నాగ్రహించిన సుయోధనుఁ డాతని వీక్షించి;

సుయోధన:— బలహీనుల నల్వురఁ జంపుటచే బల వంతుడవైన లాగునఁ దలఁచి గర్వింపకుము. లావుగల వాఁ డెప్పుడు సమానులతోడనే పోరును. కుఱ్ఱవాండ్ర దుశ్శాస నాదుల నొప్పించుట యొక గొప్పకాదు. దయదలఁచి నిన్నింతకుమున్న విడుచుటచేఁ గ్రొవ్వితివి. మహిల నా

యెదుటఁబడితివి. ఇఁకఁ దప్పించుకొని పోఁజాలవు నీవు నేఁటితోడఁ గాలము తీరెను.

భీమః:—మాటలచేఁ బోటరివిగాకుము. నీ వాదినుండియు నా మరణమునకై ప్రయత్నించుచున్నావుగా! నీయత్న మేమి కొనసాగెను? ఇది రణరంగముగాని ద్యూతగృహము గాదు. ఇచ్చటఁ బరాక్రమము చూపవలయునుగాని శకునిమామలవలెఁ గపటములాచరింప వీలుగాదు.

సుయోధనః:—ఓహో! భీమసేనులవారు నేఁడు ధానుష్కశ్రేష్ఠు లగుచున్నారు. కాఁబోలు! నాబాణముల తాఁకు దప్పించుకొని బ్రతికిన నావలెఁ జూచుకొందము.

భీమసేనః:—బాణములు వైచిన పిమ్మటఁగదా తప్పించుకొనుమాట. ఇదె నాశరము నీశరము దునుమ నేతెంచుచున్నది. దానిబారిఁ బడక తప్పించుకొనుము.

అని రెండు బాణములు సుయోధనుని హస్తములకు సూటిగాఁ బ్రయోగించెను. రాజరాజు వాని నర్ధచంద్రాకృతిఁగల రెండు బాణములచేఁ ద్రుంచెను. భీష్ముఁడా తరుణమునఁ బాండవసేనల నురుమాడుచు సుయోధనుని సమీపించుచుండెను. అతని గర్జారవమును విని తమసేనలు చెదరిపోవుట చూచి భీమసేనుఁ డించుక కలఁత నొందెను. చెదిరియున్న సైన్యము మఱలఁ బురికొల్పుట కతఁడుపక్రమించెను. అప్పుడు సుయోధనుఁ డాతని వక్షమున రెండు బాణములు వేసెను. సుయోధన శరాఘాతమున భీముఁ డొకింత చలించెను. ఇంతలోన ఘటోత్కచుఁడు మాయాబలమునఁ

గౌరవ సేనలపై విజృంభించు చుండెను. సూర్యుఁ డస్తగతుఁ డగుటచే ఇరువాగుల వారును నాఁటియుద్ధమాపి తమతమ స్కంధావారములకరిగిరి.

# సైంధవ వధ

శిఖండి తనపైఁ గవియుటచే భీష్ముఁ డస్త్ర న్యాసము గావించి శరతల్పగతుఁ డయ్యెను. సుయోధనుఁడు వెంటనే ద్రోణాచార్యుల సేనాపతిఁ గావించెను. ఆచార్యుఁడు దన్నా లాగున గారవించి సందులకు సంతసించి సుయోధనుని వరము వేఁడుకొమ్మనెను. రారాజు ధర్మసుతుని కాయము గాయము గాకుండఁ బట్టి యిమ్మని వేఁడెను. ఇదివిని ద్రోణుఁ డాశ్చర్య పరవశుఁడై;

ద్రోణః:—శిష్యశ్రేష్ఠా ! అజాతశత్రుఁడను నామ మాతని కిప్పుడు సార్థక మయ్యెను. ఆహా! శత్రువునకును దనపైఁ గనికరము గల్గింపఁ జేయునట్టి సద్గుణములు గల యాతని జన్మము ధన్యతమము. వానిఁబట్టి తెచ్చినంతనే రాజ్యభాగ మీఁదలఁచి యిట్లాడుచుంటివా? రక్తపాత మెక్కుడగుచున్నదిగదా యని మృదుహృదయుఁడ వయితివా?

సుయోధనః:—యుద్ధమున రక్తపాత మవశ్యమగు ననుట నాకుఁ దెలియును. రుధిరపాతమువలకే నంగీకరించు

వాఁడను గాన. నాకొఱకు బాంధవు లనేకులు మరణించుట యుక్తము కాదనుట నే నెఱుఁగుదును. కాఁబట్టి సంధి కోడఁబడినచో నైదూళ్ళనిచ్చి తీఱవలయును. రాజ్యార్హత లేని వారికి ఆ మాత్రమైన నిచ్చుట నీతి గర్హితము. న్యాయవిదూరమగు కార్యమునేను నిచ్చగింపనివాఁడ నగుటచే సంధి కంగీకరింపకుంటిని. యుద్ధమున కొప్పుకొని నచోఁ బాండవులు రణరంగమునను రాఁగలరు. అప్పుడు ధర్మజునిఁ బట్టుకొనవచ్చు. జూదమాడించి యోడించి, మఱల నరణ్యమునకుఁ బంప వచ్చును. ధర్మసుతుఁడు ద్యూతప్రియుఁ డగుటచే ఇది సులభసాధ్యము. నేనిది తెలిసియే యుద్ధము చేయ నంగీకరించితిని. రాజనీతి పెక్కుదెఱఁగు లగుటచే నిక్కార్యము న్యాయబద్ధము. కావున దేవరవారు నాకోర్కెని గాన సాగింపవలయును.

ఇది వినిన ద్రోణాచార్యుఁ డిట్లు తిట్టఁదొడఁగెను.

“సుయోధనుఁ డాడినలాగున నొనర్పుట యక్రమమని తోఁచుచున్నది. అన్యాయమునకుఁ బూనుకొనినఁ బాపమునకు గుఱి కావలయును గదా ? అట్లని యూరకుందమనిన రాజాజ్ఞను మీఱుటయుఁ, గోరిన వరమిత్తునని మాట చెప్పి తప్పుటయు ననెడు రెండు దోషములకు గుఱి కావలదే? ఇంతకు నీవని క్రమమగున దేల కాఁగూడను ? ‘రాజనీతి పెక్కుదెఱఁగు లగుటచే నిక్కార్యము న్యాయబద్ధ’ మని యూరకఁ వాదుచున్నాఁవుగదా ! ఆయుధ మెత్తనని చెప్పిన కృష్ణుఁడు చక్రమెత్తినదియు, శిఖండిని మున్నిడుకొని యర్జునుఁడు

భీష్మ నస్త్రసన్యస్తుని గావించినదియు నిట్టి తరగతి లోనిదే కదా! అవియెల్ల న్యాయసమ్మతము లయినచో నిదిమాత్ర మేల కాఁజాలదు;"

అని యిట్లు కొంతవడి వితర్కించుచుండి యావల సుయోధనునిఁ గాంచి ;

ద్రోణః—సుయోధనా! నీకోర్కె కొనసాగించుటకు సిద్ధుఁడనుగాని అందుల కొక యాటంకము కలదు. అర్జునుఁడు సర్వాస్త్రవేది. అతని గెల్చుట అసాధ్యము. అతఁ డెప్పుడును అన్నను వీడక యున్నాఁడు. కాఁబట్టి అతఁడు లేని సమయ మబ్బినచోఁ బాండవాగ్రజునిఁ బట్టి యీయఁగలను.

సుయోధనుఁ డీమాటలు విని సంశప్తకులకు 'అర్జునుని రణమునకుఁ జీరవలయు' నని వర్తమాన మంపెను. వారా లాగుఁ గావించిరి. సంశప్తకాహూతుఁడయి ధర్మజానుమతిని పార్థుఁడు వారితో యుద్ధము సేయ నరిగెను. ద్రోణుఁడు పాండవసైనికులతో ఘోరముగఁ బోరు నలుపుచుండెను. ఆసమయమునఁ గౌరవులు పద్మవ్యూహము గావించిరి. అందుఁ జొచ్చుట అభిమన్యునకుఁ దక్కఁ దక్కినవారికిఁ దెలియదు. కాఁబట్టి యాతఁ డందుఁ బ్రవేశింప నరిగెను. అతనివెంటఁ బాండవు లావ్యూహమునకుఁ బ్రవేశింపఁ బోవుచుండ సైంధవుఁడు వారిదారి కడ్డుపడియెను. ఈశ్వరదత్త వరమహిమచే వాని జయింపఁ బాండవులకు సాధ్యము గాదయ్యెను. లోనఁ జొచ్చిన యభిమన్యుఁ డనక్రపరాక్రమ

ముతో యుద్ధము సేయుచుండఁ బెక్కు రొక్కపై వానిని దాఁకి తునుమట్టించిరి.

సంశప్తకుల సంహరించివచ్చిన పార్థునకు వార్తదెలిసెను. తనకుమారుని మరణమునకు సైంధవుఁడే ముఖ్యకారణమని తెలిసి వానిఁ జంప శపథము గావించెను. ఇది విని సుయోధనుఁడు ద్రోణుని సమీపించి ;

సుయోధనః—ఆచార్యా! అర్జునుఁడు చెంతలేకున్న ధర్మరాజును బట్టెదనని యాసతిచ్చి యుంటిరి. దీనికొరకే కదా సంశప్తకులను ప్రత్రమాన పంపి యర్జునుని వారియొద్దకు రప్పించుకొనులాగున నొనర్చితిని! అదివమ్మయ్యెను. అర్జునుఁడెంత విజృంభించినను వాని జోలికిఁ బోకున్నారు. మీరు పాండవ పక్షపాతులు. అర్జునునకు మేలుగూర్ప నెంచువారు. తెలిసి తెలిసి మిమ్ము విశ్వసించినది నాలోపమే యగును. నేను పూసిన కత్తివలెనుండుట తెలియక ఇంతకుఁ దెచ్చుకొంటిని. అదె సైంధవునిఁ జంప నర్జునుఁ డరుగుచున్నాఁడు. మీ ప్రభావము చూపవలసినదే కదా తగుసమయము? మిమ్మిలాగునఁ దూలనాడితినని యన్యథా తలఁపకుఁడు. ప్రసన్నులరై యున్నారలని మీకలుక పుట్టించినఁగాని కార్యము కొనసాగదని యీలాగునఁ బలికితిని; కాఁబట్టి నను క్షమించి, నాయందనుగ్రహముంచి, వెంటనే సైంధవుని రక్షింపఁ బూనుఁడు.

ద్రోణః—రారాజ! నీమాటకును మాయశ్వత్థామ మాటకును నే భేద మెంచువాఁడను గాను. సేనాముఖమును వీడి నేనర్జునుని వెనుకఁబోయినఁ బాండవ బలము మన

సైన్యముపైఁ గవియును. అప్పుడు మన సేన చెల్లాచెదరగును? సైంధవుని రక్షించుట యతికష్టము. ధర్మసుతునిఁ బట్టుటకు సమయము వేచియుండవలసిన వాఁడనుగాఁ బట్టి నేను గాండీవి నడ్డుట కరుగుట యుచితము కాదు. అతఁడును నీవును దుల్యబలులు. శంకింపక నీవాతని నడ్డుపుము. తగుసహాయమును గూర్చెదను. ఇచ్చట నాలసింపకుము. నే నొసఁగునట్టి యీకవచము ధరింపుము. దీనఁ బార్థుని శరములు నీ శరీరమును దాఁకకుండును.

అని యొకకవచము నిచ్చెను. సుయోధనుఁడు గురువు నానతి మీఱరాదని యెంచి ఆకవచము ధరించి సేనాపరివృతుండయి యర్జును నెదిరింప నేఁగెను. పార్థుని యెదుట నిలువఁజాలక పర్వెత్తుచున్న తన సేనకుత్సాహము గల్పించుచు వానిని సమీపించి ;

సుయోధనుఁడు:—అర్జునా ! నీవొక మేటివైన లాగునఁ దలఁచి నే లేనియెడల నెల్ల నరుగుచుండుటచేఁ బ్రదుకఁ గలిగితివి. ఇదె నే నెదురుపడితిని. ఇంక నీవాలాగునఁ దప్పించుకొని పోవుటకు వీలులేదు. ఏదీ! నీశస్త్రవిద్యాకౌశలము చూపుము.

అని యర్జునునిపై సుయోధనుఁడు మూఁడు వాఁడి నారసముల నేసెను. నాలుగు బాణముల వాని గుఱ్ఱములపై వైచెను. పదిశరములఁ గృష్ణుని యురమున వైచి యొకసాయకమున నాతని చేతిలోని ములుగోలఁ గూలనేసెను. పార్థుఁడు పెక్కు బాణములు వైచెనుగాని అవియెల్ల నాతని కవచమును

దాఁకి తునిఁగి క్రిందఁబడుచుండెను. ఇది గాంచిన కృష్ణుఁ డాశ్చర్యమున ;

కృష్ణ:—అర్జునా ! మున్నెన్నఁడు నీ బాణము లీలాగున వ్యర్థములుగా లేదు. పిడుగువలె శత్రువులదాఁకియుద్ధము సేయు వాఁడవు నేఁడీహీనుని యించుక నొప్పింపనైన సమర్థుఁడవు గాకపోవుట కడువింతగ నున్నది.

అర్జు:— ఇతఁడు దొడుగుకొని యుండునట్టి కవచ ప్రభావ మట్టిది. ఆచార్య యనుగ్రహమున వీఁడిక్కవచమును బొందియున్నవాఁడు. ఇంద్రదత్తమగు నస్త్రమొక్కటి నా యొద్ద నున్నది. అది సకలకవచ నిర్భేదనము. దాని మూలమున వీనిని గాయపఱతును.

అని యర్జునుఁ డొకయస్త్రము వైచెను. అశ్వత్థామ కాయస్త్ర మహిమ తెలియును గాఁబట్టి సర్వాస్త్రఘాతియగు నొక యస్త్రమున దానిని ఛేదించెను. అర్జునుఁడశ్వత్థామ యాచరించిన యాకార్యమునకుఁ దెల్లఁబోయియు ధైర్యము నవలంబించి వేఱొక యస్త్రము నెత్తఁ బోయెను ? ఇంతలోన సుయోధనుఁ డర్జునునిపై బాణవర్షము గురిపించెను. కురు సేన లర్జునుని యీ పరాభవము గాంచి పెల్లుగ సింహనాదములు గావించెను. పార్థుఁడు మిక్కిలి కోపముచెంది సుయోధనుని రథసారథులఁ దునిమెను. విరథుఁడగు సుయోధనుఁ డించుక చింతింపుచుండ గా అదియే తగు నమయమని భావించి పార్థుఁడు విజృంభించెను. వీనిధాటి కాఁగలేక కౌరవ సైన్యము నలుదిక్కులకుఁ బఱ్వలిడఁ జొచ్చెను. సుయోధనుఁడు వానిఁ

బుద్ధిగొల్పి మఱల సమరమునకు సన్నద్ధుఁడగు నంతలోన వృషసేనుఁడు మున్నగువా రరుదెంచి పార్థుని మూఁగొనిరి. అర్జునుఁడు వారితోడ రణము సేయుచుండెను. సుయోధనుఁ డంతలోన వేఱొక రథమెక్కెను. నూతనాంబ రాభరణ ములఁ దాల్చెను. క్రొత్తకవచము ధరించెను. నవ్యశరాసన మును జేతఁ బూనెను. ఈలాగున యుద్ధసన్నద్ధుఁడై వచ్చుచు మఱల నాచార్యునిఁగాంచి సైంధవరక్షణార్థము దనకు సాయ పడమని వేఁడెను. ద్రోణుఁడు పూర్వమువలెఁ దాను సేనా ముఖమున నుండవలయు నని బదులాడుటచే ఖిన్నుఁడయి;

“ఆహా! ఆచార్యుఁ డర్జున పక్షపాతియయి మన కార్యమున నౌదాసీన్యము వహించుచున్నాఁడు. నేఁటితో దుశ్శలభర్త యాయువు దీఱెను గాఁబోలు! తన్ను గట్టఁద్రాళ్లు తానే తెచ్చుకొనులాగున ఎఱిఁగి యెఱిఁగి యీతని సేనా పతిఁ గావించుకొని యిట్టి యాపదకు గురియయితిని. ఇఁకఁ జరించిన లాభమేమి.”

అని తలపోయుచు సుయోధనుఁడు పార్థుని సమీపింప వచ్చుచుండెను. అప్పుడు యుధామన్యుఁడు, నుత్తమౌజుఁడు నర్జునునకుఁ దోడ్పడ వచ్చుచుండ వారల నెదుర్చెను. ఉత్తమౌ జుఁడు సుయోధనునిచాపము దునిమెను. రారాజు వేఱొక శరాసన మందుకొని వాని సారథిని, దురగములను దునిమెను. ఉత్తమౌజుఁడు యుధామన్యుని రథమెక్కెను. వారిరువురు రాజరాజ రథవాజులను, సారథిని సంహరించిరి. కౌరవేశ్వరుఁడు మద్రదేశాధీశుని రథమెక్కెను. ఇంతలోన

దుర్ముఖాదులు దనసోదరులు గొందఱు రణభూమిని నిహతులగుట దెలిసి విధిని దూఱుచు వేఱొక దెస కేఁగెను. అదియే యదనని భావించి యర్జునుఁడు సైంధవుఁడున్నదెసకు వచ్చి వానిని సంహరించెను.

# సంకులసమరము

"ఔరా! ఇంత కాలము సత్యవాది యని వాసిగాంచిన యజాతశత్రుఁ డిది యసత్యమనుట దెలిసియు "నశ్వత్థామా హత" యని బిగ్గఱగాఁ బలికి కుంజర యనుమాట యల్లన నాడెఁగా! భీమసేనుఁ డశ్వత్థామ హతుఁడయ్యెనని పలికిన నమ్మకుండిన యాచార్యుఁ డీతని మాటచేఁ గదా యస్త్ర సన్న్యాసము గావించెను."

కాలము విపరీతమగునపుడెల్లరు నకారణ విరోధులగుట నిక్కము. అట్లు కానిచో విశ్వామిత్రాదులకు నేనేమి యపకారము గావించితిని? వారికేల నాపై నిష్కారణ ద్వేషముదయింపవలయును? నాపై విరోధమునఁ గాకున్న వారేల యాచార్యుని సమీపించి యుద్ధమాడవలదని యుపదేశించి యుందురు? వారి మాటలును యుధిష్ఠిరుని యసత్యవాక్యములును గదా ఆచార్యుని మరణమునకుఁ గారణములు? ఆచార్యుఁడు మరణించినంతనే జయము గలిగెనని ధర్మతనయుఁడు తలఁచెను గాఁబోలు! కర్ణుని సేనాధిపతిగా నొనర్చియున్నందున నతఁడు వీరిని సంహరించుననుట యెఱుఁగడు.

వివేకరహితుఁడగు నీ పాండవ జ్యేష్ఠుఁడు, ద్రోణనిష్ఠ నున్న యాచార్యుని బాలిశుఁడగు దృష్టద్యుమ్నుఁడు సంహరించుచుండ నూరకుండెనఁట. ఇదియా యాతని ధర్మజ్ఞత! ధర్మరాజని పేరిడుకొని తృణచ్ఛన్నకూపమై ఇట్లెందఱవంచింప నెంచియున్నవాఁడో కదా? ఇట్టివాని నిఁక నూరక విడుచుట పాడిగాదు. ఇదే నేనరిగి యాతని ప్రాణములఁ గొనెదను."

అని ఈలాగునఁ దలపోయుచుండిన సుయోధనుఁడు రథమెక్కి రణరంగమునకు వచ్చెను. వచ్చినవాఁడు వేఱెవ్వని యొద్దకుఁ బోవక తిన్నఁగా ధర్మసుతుని చెంతకే యరిగెను. ధర్మజు, నాతని సారథిని శరాహతిచే నొప్పించెను. యుధిష్ఠిరుఁడు సుయోధనుని హయ సారథుల సంహరించెను.

అంత నారథము నుండి క్రిందికిదూఁకి పదాతియై సుయోధనుఁడు వెనుదీయక ధర్మజుని శరీరమున నాటులాగునఁ గొన్ని బాణములు వైచెను. రాజరాజ బాణహతిని నొచ్చిన ధర్మతనయుఁ డాగ్రహించి ఆతని వింటిని దునిమెను. ఖడ్గహస్తుఁడై యాతఁడు ధర్మజునిరథముపైకుఱుక నుంకించుచుండ నాతని చేతి కత్తిని రెండర్ధచంద్ర బాణములచేఁ దునియలు గావించెను. నాలుగుశరములు నాతని యురమున నాటనేసెను. యుధిష్ఠిర బాణపాతమున విహ్వలుఁడగు సుయోధనునిఁ గాంచి దవ్వులనుండిన కర్ణాదులచ్చటికరుదెంచిరి. వీరిటు వచ్చుట గాంచుచుండిన భీమసేనాదులు ధర్మజునకుఁ దోడ్పడ నచ్చటికి వచ్చిరి. అంత నుభయసేనలకును సంకుల యుద్ధము జరిగెను.

ఇంతలోన వేఱొక రథమెక్కి మఱల నచ్చటికి వచ్చిన సుయోధనుఁడు ధర్మసుతుని చేతి వింటిని దన శరములచేఁ దునిమెను. అతఁడు వేఱొక ధనువుపూని ధార్తరాష్ట్రుని శరాసనమును ద్రుంచెను. కురుపతి వేఱొక చాపమును బూని ధర్మజుని శరీరమున నాటులాగున వాఁడియమ్ములఁ గొన్నిటి నేసెను. ధర్మరాజు కౌరవనాథునిపైఁ గొన్ని బాణములు ప్రయోగించి వానిని నొప్పించెను. సుయోధనుఁ డొకశక్తిని వైచెను. అజాతశత్రువు మార్గమధ్యముననే దానిని దునిమెను. ఇదిగాంచి కోపించిన కురుజ్యేష్ఠుఁడు కొన్ని బాణము లేసి ధర్మరాజును నొప్పించెను. ధర్మసూతియు వెయ్యంజ వేఁడుక నిశ్చలుఁడై శత్రుబాణహతి కోర్చుచు మఱల సుయోధనునిపై బాణవర్షము గురిపించెను. గాంధారీతనయుఁ డాశరముల తాఁకున మూర్ఛిల్లెను.

ఈ లాగున సుయోధనుఁడు మోహావరవశుఁ డగుట చూచి కృతవర్మ ధర్మపుత్త్రునితో యుద్ధము సేయ నను వెంచెను. అప్పుడు భీముఁ డాతని నెదిరించెను. వీ రిరువురు రణ మొనర్చుచుండ నింతలో సుయోధనుఁడు మూర్ఛఁ దేఱెను. మఱల ధర్మరాజుపైఁ గవియ నరుగుచుండ నర్జునుఁ డీతని కడ్డుపడెను. క్రోధావిష్టుఁడగు సుయోధనుఁ డాతని బెక్కుబాణముల నొప్పించెను. పార్థుఁడు గాంధారీతనూజుని సూతుని,రథాశ్వములను,ధ్వజమును, ధనువును ఏడేసి బాణములచేఁ దునిమెను. ప్రాణాంతకమగు నొకబాణమును బ్రయోగించెను. అప్పుడు సుయోధనునకు సహాయపడఁ గృపుఁడును

అశ్వత్థామయు నరుదెంచి, అశ్వత్థామ యుపయోగించిన యా బాణమును మార్గ మధ్యముననే తన శరములచేఁ ద్రుంచెను. కృపుఁడు పార్థునిపైఁ గొన్ని బాణములు వైచెను. కిరీటియుఁ గృపునివిల్లు రెండు తునియలు గావించెను. కృత వర్మ రాఁగ నాతని నొప్పించెను. దుశ్శాసనుని విల్లు దుని మెను. కర్ణునితో యుద్ధముసేయ నెంచి యటు వెడలెను. ఇట్లా నాఁడంతయు సంకులసమర మతిభీకరమై జరుగుచుండెను.

# గదా యుద్ధము

"సుయోధన రాజేంద్రా! ఏల ఈ లాగున మడుగునఁ దాఁగవలయును? కర్ణశల్యులు, సోదరులును జావఁగనే మేమును జచ్చితిమని తలఁచితివే?"

"కృపాచార్యా! ఆచార్యపుత్త్రా! ఎన్నఁడును నేను నీచకృత్యములకుఁ గడఁగువాఁడను గానను మాటెఱుఁగనిది కాదు. సోదర బాంధవ మరణమున నొడలెఱుఁగక యుద్ధము చేసితిని. నాశరీర మస్త్రముల వాఁడిన నొవ్వను అలసిక మెండయ్యెను. డప్పి యతిశయించెను. మనసు వసమతి యుండెను. ఇంచుక విశ్రమించినఁగాని యరులతోఁ బోరఁ జాలక ఈ మడుగుఁ జొచ్చితిని. పాండవుల యాగ్రమ మప్ప టప్పటి కతిశయించుచుండుట కర్ణాదు మూలమైన మీకు విదితపూర్వమే. ఆ క్రూరులు శత్రువు చిక్కెనని చవ్వున

సంహరించువారు కాని ఇదియు సమయమని ఇంచుక యోచ్ప వారు గారు. ఇది తెలిసి యూరక వారిచే బడి చచ్చుట కంటె నేఁడించుక విశ్రమించిన రే పవగతశ్రముండ నగుదును. అప్పుడు వారి నవలీలంగా వధింపఁ గలుగుదును. ఈ యుద్దేశముతోడనే నే నీహ్రదమునఁ బ్రవేశించితినిగాని శత్రువులవలని భీతిని బాఱిపచ్చి దాఁగిన వాఁడను గాను. మీ గొంతు నవ్వడివిన్న మీరును మిక్కిలిడస్సి యుండుటదెలియు చున్నది. కాఁబట్టి మీరును గొంచెము విశ్రమింపుఁడు."

సుయోధనుని యావాక్యము లాలించి కృపాశ్వత్థామలు మఱలివచ్చుచు నీలాగున సంభాషించుచుండిరి.

"మామా? చూచితివే విధి విలసితము! న్యాయవర్తనుల కిడుములు గల్పించుచు నక్రమవర్తనుల కభివృద్ధి నొసఁగుచుండు నాదైవ మేమనవలయును? లోకము వారును న్యాయాన్యాయ పరిశీలనాజ్ఞానము లేక పై వేసములఁ జూచి మోసపోవుచుందురు. పాండవు లాచరించిన న్యాయసమ్మతములా యనుట యూహింపక వారి పైవేసములఁ జూచి వంచితులై కౌరవు లక్రమ ప్రవర్తనులని యాడుచుందురు. విషప్రయోగాముల మూలమున వీరు భీముని జంప నెంచిరని యూరక దూఱుదురు కాని వృకోదరుఁడు మాన భంగము గావించుచు వీరికిఁ బెక్కుకష్టములఁ గలిగించెనని ఎవ్వరేఁ జెప్పఁ గలిగిరే? సుయోధనుఁడు పాలింపవలసినది న్యాయముగా నుండ నాఁడు యుధిష్ఠిరుఁడు యువరాజగుట యక్రమ మగునని ఎవ్వరైన నాడిరే? రాజసూయము యాగసమయమున

ద్రౌపదీ వృకోదరులు రాజరాజును బరిహాసించిన దక్రమ మునకు వీరికి మూర్ఖత్వము గలిగెను. జూదరియయి పాండవాగ్రజుఁడు శకునితో జూదమాడి దైవవశమున నోడిన నందులకు సుయోధనునిఁ గారకునిగాఁ జేసి వృథా దూషణ సల్పుటకు మాత్రము వీరికింత నోరు గలిగెను."

"అబ్బాయీ! నీ వాడునదెల్ల వాస్తవ మగునదియే. సుయోధనాదులు మాయాదురోదరమున గెలుపొంది పాండవులఁ గానలపాలు గావించిరని తత్పక్షపాతులయి పల్కెదరు గాని పాండవ పక్షములోని వంచనలేల తెలిసికొన కున్నారు? యుద్ధమునకుఁ దోడ్పాటుగోర రారాజు ద్వారవతి కరిగినపుడు కృష్ణుఁడు నారాయణ గోపాలురనిచ్చి సరిపెట్టి పంపినది వంచన కాదు కాబోలు? శల్యునితో ధర్మతనయుఁడు "నీవు కర్ణార్జునుల యుద్ధసమయమునఁ గర్ణునకు సారథివై యాతనిఁ దూలనాడి యుద్ధము వలని నిరుత్సాహునిఁ గావింపు" మని వేఁడుకొనిన దన్యాయము కాదేమో? యుధిష్ఠిరుఁడు రహస్యముగ భీష్ముని చెంతకరిగి యాతని వధోపాయ మడిగినది యక్రమము కాదేమో? అసత్యములాడి యాయాచార్యు నస్త్రసన్న్యస్తుని గావించినది సజ్జన సమ్మతమా కాఁబోలు? సైంధవవధనాఁడు మాయాతిమిరమును గల్పించి సూర్యునిఁ గప్పడకుండఁ జేసిన యాకృష్ణుని నేఁటి నీతిబాహ్యము కాదే? ఇట్టి యక్రమములెన్నియో వారాచరించిరి. జనుల కవి యన్యాయములని తోఁచకున్నవి. మనవా రాదినుండి న్యాయమార్గమున

నడుచుచున్నారు. దీని నక్రమమని వారాడెవరు. ఏమి సేయు దము? ఈకాలమున న్యాయమునకు స్థానము లేదు."

"మామా! ఇది ద్వాపరాంతము కాదా! న్యాయవర్తమునకిఁక నిచ్చటినుండి స్థానము కలుగునా? ఇప్పుడు నేనొక విధమునఁ దృప్తిపడుచున్నాను. ఎట్లన? మన సుయోధనుఁడాదినుంచి సర్వసౌఖ్యముల ననుభవించు చుండెను. కష్టమన్న దెఱుఁగఁడు. రాజరాజ బిరుదాంకితుఁడై ఏకచ్ఛత్రాధిపత్యమున నీభూమండలమును బరిపాలించెను. విధేయులగు సోదరులతోడను, నాయట్టి హితులతోడను గూడి సర్వదా సంతుష్టుఁడయి యొప్పుచుండెను. వైష్ణవమును యజ్ఞము సేసి ఖ్యాతిఁ గాంచెను. ఐహిక సౌఖ్యములలో నితఁ డెద్దియుఁ గొఱవడక యనుభవించెను. ఇంక వారో; బాల్యముననే తండ్రి చావఁగా దిక్కుమాలి దాయాదుల యింటఁ బెరుగుచుండిరి ఏకచక్రపురాదులయందు మాఱువేసము పూని బిచ్చమెత్తుకొని బ్రదుకుచుండిరి. పన్నెండు వత్సరము లరణ్యమున నుండి పడరానిపాట్లు పడిరి అజ్ఞాతవాసవత్సరమున విరటుని కొలువుకూటమున అతినీచమగు దాస్యవృత్తి నవలంబించి యుండిరి. ఎప్పుడు వీరు సుఖింపఁ గలిగిరి? ఒకవేళ యుద్ధమున సుయోధను సంహరించి రాజ్యమును బడసినను బంధువులెల్లరు చచ్చుటచే ఆవ్యసనపుఁ గూడు దక్క వీరనుభవింపఁ బోవున దెద్ది. ఇట్టి యనుభవముకంటెఁ జచ్చుట మేలుకదా? ఇదియే ఈయుభయులలోని క్రమాక్రమముల వెల్లడిసేయుచున్నది. ఇంకనజ్ఞానమున లోకమేలాగున నాడిన నేమి?"

అని ఈలాగున సంభాషించుచుఁ గృపాశ్వత్థాములు వెడలిరి. ధర్మతనయుఁడు; సుయోధనుని వెనుకుట కేఁగిన వేఁటగాండ్ర మూలమున రారాజు ద్వైపాయన హ్రదమున నుండుట యెఱిఁగి సోదరసహితుఁడై కృష్ణునితోడ నాహ్రదముంగు నొద్దకరుదెంచి:

"సుయోధనా! ఇదియా పోటరియగు వాఁడాచరింప వలసినది! చుట్టములు చచ్చిరి. సోదరులు హతులయిరి. నీవొక్కఁడవు మాత్రము జీవించి యేమిసేసెదవు? నీట దాఁగి నంతనే చావు దప్పునే? ఇదియా రాజరాజ బిరుదాంకితునకు లక్షణము? అభిమాన ధనుఁడని పేర్వడఁగు చుండుట కిది గుఱుతు గాఁబోలు? వెంటనే యుద్ధమునకు రమ్ము. లెమ్ము. రణనిహతుఁడవైన వీరస్వర్గము నందఁగలవు. జయించిన నిస్సపత్నమగు రాజ్యమును జెందఁగలవు. కాఁబట్టి ఇకనైనను ఈ నీచకృత్యము వదిలి హ్రదమునుండి వెలువడుము."

"ధర్మపుత్రా! నేనెప్పుడును రణము వలనఁగాని, మరణము వలనఁగాని భీతుఁడను గానని యెఱుఁగుదువు. యుద్ధమున నలసి, సేదఁదేఱ నిచ్చటికి వచ్చితిని. మీరును ఇన్ని దినములుగా జరిగిన రణమువలన డస్సియున్నారు. కాఁబట్టి ఈదిన మించుక విశ్రాంతి నందుఁడు. రేపు యుద్ధము సేయుదము."

"ఇంతదాఁక నీవు గానుపింపమిని యుద్ధము లేకుండెను. కాఁబట్టి మేము సేద దేఱితిమి. నీవింతకాలము హ్రదమున

విశ్రాంతుఁడవైనది చాలును. ఇంక వెలువడుము. లెమ్ము. నీట దాఁగినంతనే రాజ్యము దక్కఁబోదు"

"నే రాజ్యలుబ్ధుఁడ ననియా తలఁచితివి? దాతలలోఁ బ్రథముఁడగు కర్ణునకుఁ జెలిని. దానవీరుఁడని ప్రసిద్ధిఁబడసిన వాఁడను నాయెడ లోభము లేదు. నిక్కముగ నీ కట్టి సంశయమే యుండిన నారాజ్యమెల్ల నీకు దానము చేసెదను. గ్రహింపుము."

"ఓయీ! రాజులకుఁ దమ పరాక్రమమువలనఁ బడసినది కీర్తిదాయకము. కాఁబట్టి నీదానము నాకేల? శత్రుసంహారమొనర్చి జయలక్ష్మితోడ రాజ్యలక్ష్మినిఁ గైకొనుటుచితము."

"ధర్మతనయా! నేను బ్రాణములపైఁ గల తీపిచే నీలాగున నాడితినని యా తలఁచుచున్నావు? లుబ్ధుఁడను గానను టనిదర్శన పూర్వకముగాఁ జూపవలయునను నుద్దేశముతో నాలాగునఁ బల్కితిని."

సుయోధనా! మాటలతోఁ బ్రొద్దుపుచ్చుచుండుట శ్లాఘ్యము గాదు. ఎదుటివాఁడు పిలిచినంతనే యుద్ధమునకు వచ్చుటఁగదా పరాక్రమవంతుని లక్షణము?"

"సరి. అట్లే వచ్చుచున్నాను. ఇదివఱలో రథారూఢులమై చాపములు గొని పెక్కుతడవలు యుద్ధమొనర్చి యుంటిమి. ఇప్పుడు పాదచారులమై గదఁగొని రణము సల్పనెంచుచున్నాను. మీరిందఱకు సంసిద్ధులు గండు.

"అలాగుననే కానిమ్ము. ముందు నీటినుంటి వెలువడుము."

ఈ మాట లాలకించిన సుయోధనుఁడు ద్వైపాయన హ్రదమునుండి వెలికి నిర్గమించెను. గదాధరుఁడగు నాతని యప్పటి యాకారము కల్పాంతము నందలి యంతకుని రీతి పరిభయంకరమై యుండెను. ధర్మసుతుఁడంత సుయోధనునిఁ గాంచి;

"ఓయీ! మా యేవురిలో నీకిష్టమగువాని నొకనినిఁ గోరుకొనుము. వాఁడే నీతో యుద్ధమునకుఁ గడఁగును. వాఁడు మరణించెనేని నీవు జయమందిన లాగున నగును. అంత రాజ్యము నీవ యేలుకొనవచ్చును. నీవు చావఁబడవయిన రాజ్యము మా యధీన మగును ఇది మా సమయము."

యుధిష్ఠిరుని యీమాటలు విని కృష్ణుఁడదిరిపడి యాతనిఁ గాంచి;

"ధర్మజా! ఇదేటిమాట? ఈతఁడు గదాయుద్ధమున నతి నిపుణుఁడు. భీమసేనుఁడును గదాయుద్ధమునఁ గడు నేర్పరి. కాఁబట్టి వీరిరువురికు యుద్ధము జరుగుట న్యాయమగును గాని గదాయుద్ధ చతురులుగాని తక్కినవారి నీతఁడు కోరుకొనుటకు మన మంగీకరించుట సరికాదు."

సుయోధనుఁడు కృష్ణుని పలుకులు విని సంతుష్టుఁడాయెను. అతనికి ఆదినుండి భీమునిపైఁగదా విరోధము ఇప్పటి కృష్ణుని మాటలు తన పగ దీర్చుకొనుట కనుకూల మగునవి యని తలఁచి భీమునిఁ జూచి;

"వాయునందనా! కృష్ణుఁడాడిన లాగున నీవ నాకుఁ దగినవాఁడవు. "వివాహశ్చ వివాదశ్చ సమయోరేవశోభతే"

యనుట నిక్కము. కాఁబట్టి నీవు నాతో గదాయుద్ధమునకుఁ గడఁగుము. బాల్యమునుండి నీవు మాకుఁ గావించుచుండిన యపకృతులకుఁ దగు ఫలమిప్పుడ యనుభవింపఁ గలవు."

అంత భీమ సుయోధను లొండొరులతో యుద్ధము సేయ నంగీకరించిరి. ఆతరుణమునఁ దీర్థయాత్రాపరుఁడయి యరిగియుండిన బలరాముఁ డచ్చటికి వచ్చెను. అచ్చటివార లాతని గౌరవించిరి. బలుఁడు తన సల్పిన తీర్థయాత్రవివరించి; భీమ సుయోధనులకు గదాయుద్ధము జరుగఁబోవుట విని చూడవచ్చితి ననెను. అపుడచ్చటి వారెల్లరు రణరంగమున కరుదెంచిరి. భీమ సుయోధనుల గదాయుద్ధ మారంభమయ్యెను. వారొండొరుల మీఁదఁ జూచుచుండిరి. మండల ప్రచారముల యుద్ధమాచరించునపుడెల్ల నొకఁ డొకవైపున కరిగిన యెదుటివాఁ డాతనికి యెదుటివైపున కరుగును. శత్రువు తనవైపునకుఁ దిరిగినచో నితరుఁడు వేఱొక వలనకుఁ దిరుగుచుండును. ఒక్కొక సమయముల నెదుటివాఁడు సవ్యముగఁ బోయినఁ దా నపసవ్యముగఁ బోవులాగున నటించుచుఁ జప్పున నాతని కెదురేఁగును.

ఈ లాగునఁ బెక్కు గతిభేదముల భీమ సుయోధనులు దిరుగుచు, నొకరి గదాఘాతము నింకొకరు దప్పించుకొనుచు, యుద్ధము సేయుచుండిరి. జయ మేవైపునకుఁ గలుగునదియును దెలియకుండెను. భీముఁడు బలాధికుఁడు. సుయోధనుఁడు గదాయుద్ధమునఁ జక్కఁగ గురుశిక్ష పొందినవాఁడు. ఈ కారణమున వారొండొరుల జయింప లేకుండిరి. తగిన పాత్ర మబ్బెఁ

గదా యని భీముఁడును, గదా విద్యాభ్యాసమునకుఁ దగు లక్ష్యము చిక్కఁగదా యని సుయోధనుఁడును సుత్సాహ పూరితులై యుద్ధము సేయసాగిరి.

ఇట్లు కొంతవడి యుద్ధము సేయుచుండ శిక్షావిశేష రాహిత్యమున భీముఁడించుక వెనుదీయవలసి వచ్చుచుండెను. సుయోధనుఁడు శిక్షాశయముతోఁ బాటు గురువును సమీప మున నుండుటచే మేలుబంతి యనిపించుకొను లాగున గోచ రించెను. ఈసూక్ష్మమును గని పెట్టిన కృష్ణుఁ డర్జునునిఁగాంచి;

"భీముఁడు నాఁడు సభలో సుయోధనుని తొడలు విఱుగఁ దన్నులాగునఁ జేసిన ప్రతిన మఱచెను గాఁబోలు? లేక గదాయుద్ధమున నాభికి దిగువనుండు శరీర భాగములను నొప్పిం చుట యధర్మమని యూరకున్నవాఁడో? ఇట్టి నీచునెడలనా ధర్మాధర్మ విచారములు సేయుట? వీనికిఁ దొడలలో బలము తక్కువ. కాఁబట్టి యూరువులపై గదాహతి యొనర్చిన వీఁడు మరణింపఁ గలఁడు."

అర్జునుఁ డిది విని భీమునకు చూచులాగునఁ దన తొడలఁ జఱచుకొనెను. మారుతి యది గాంచి సుయోధనుని తొడల భంగముగావింప నెంచెను. మఱల నది యధర్మమని వెనుదీయఁ జొచ్చెను. తుదకుఁ గృష్ణునానతి మీఱుట దగదని తలఁచి యూరుభంగము సేయఁ గృతనిశ్చయుఁ డాయెను. తన గద నెత్తి సుయోధనుని తొడలపై వైచెను. వెంటనే రాజరాజు తొడలు విఱిగి నేలఁ గూలెను. బలరాముఁ డీయక్రమ యుద్ధ

మును జూచి యోర్వలేక కటకట పడెను. కృష్ణుఁడాతనిఁ గాంచి ;

"అన్నా ! భీముఁడు నాఁడు సభలో సుయోధనుని యూరువుల విఱుచుటాకునఁ బ్రతిజ్ఞ గావించి యుండెను. కాఁబట్టి తన శపథము నిర్వర్తించుకొనెను. అటు సేయనిచో నసత్యవాది యగును గదా ? మైత్రేయ మహాముని శాపము నీతనికిఁ గలదు. అది రిత్తవోవునె ?

కృష్ణుని యీపలుకులు బలరామునకు నచ్చకుండెను. తుద కతఁడు పాండవులను, కృష్ణుని నిందించుచు ద్వారవతి కరిగెను. సుయోధనుఁడు గదాఘాతసంభూతవేదనాయత్తుఁడై కృష్ణునిఁగాంచి;

"ఓరీ ! నందానవృత్తి ! నీవు ఆ యర్జునిలోఁ జెప్పి భీము నక్రమయుద్ధమునకుఁ బురికొల్పితివి గదా ! ఇది యేటి న్యాయము ? ఆహా ! ఈ భారతయుద్ధమెల్ల నీ యక్రమములతోడనే నిండి యున్నది. తొల్దొల్త శిఖండిని మున్నిడుకొని యర్జునుఁడు శాంతనవునిఁ గూల్చ లాగొనర్చితివి. ధర్మజునిచే నసత్యము లాడించి యాచార్య శస్త్రసన్న్యాస మొనర్చులాగునఁ జేసితివి. అది చాలక వేద వేదాంగ తత్త్వజ్ఞానామహాత్ముని ద్రుపదుర్యునిచేఁజంపించితివి. రథము భూమిని గ్రుంగియుండ నాయుదను గాంచి కర్ణునిఁ జంపించితివి. భూరిశ్రవుఁడన్యునితో యుద్ధ మొనర్చుచుండఁగాఁ జంపితివి. మాయాతిమిరమును గల్పించి సైంధవుని మృతికిఁ గారకుఁడ వైతివి. నేఁడిటు పార్థున కుపదేశించు నెపమున భీమునిచే నను

గూల్పించితివి. నాఁటినుండియు నీయక్రమ ప్రవర్తనములును, నీ సహవాసముచే కలవడిన వీరి యక్రమ కార్యములును గదా నన్నింతకుఁదెచ్చెను ?

ఓరీ! నీవు నన్నేలాగున భంగపఱిచినను నే ననుభవించిన సౌఖ్యములోఁ బదియవ పాలైన వీరనుభవింపలేరు. సర్వబంధు నాశనమునఁ గలిగిన యీదుఃఖముఁ గూడుకగదా వీరనుభవింపఁ బోవునది? పరలోకమున నేని అసత్యవాదియగు నీ ధర్మజునకు సుఖము గలుగదనుట నిక్కము. నేనింతకాల మిట సుఖించితిని. యుద్ధమున మరణించుటచే నిఁక వీరస్వర్గ మనుభవింపఁ బోయెదను.”

అంత పాండవులు సుయోధను నచ్చటనె విడిచి కౌరవ శిబిరముల వైపుఁ దిరిగిరి.

# ఉపసంహారము

పాండవు లాలాగున వెడలిన పిమ్మట సుయోధనుఁడు మాత్ర మొంటరియయి నేలఁబడియుండెను. అప్పుడు సంజయుఁ డటకువచ్చెను. ఆతనిఁగాంచి సుయోధనుఁడు కన్నీరుగార్చుచు;

“సంజయా! కాలగతి యెట్టివారికి నలంఘ్యము. ఎట్టివాని కెట్టి దశ పట్టినదో చూచితివా? పదునొకండక్షౌహిణులు గొలువ ఎల్లరాజుల నాజ్ఞలో నిలుపుకొని యుండిన వాఁడను నేను నేఁడు దిక్కుమాలి యిటఁబడియున్న వాఁడను.

ఆ నీచులు పాండవులు అక్రమ యుద్ధమున నన్ను నేఁ గూల్చి సోదరప్రీతిని విడనాడి వెడలిరి. ఇఁకఁ జావనున్న నాకు ఒంటరిగా నుంటినను భయము లేదు.

ఆర్యా! నీవు నా జనకులయొద్ద కరిగి వారి నాశ్వాసింపుము. నూర్గురు పుత్రులు శీఘ్రకాలములోఁ జచ్చుట యిది దుఃఖావహమే. అయినను దైవము నేర్చిన దుఃఖించిన లాభము లేదని చెప్పుము. ఇంతకును జచ్చునంతకు సర్వ సౌఖ్యము లనుభవించుచుంటిని. అరిభయంకరుఁడనై ఏకచ్ఛత్రాధిపత్యమున ధరాచక్ర మేలితిని. ఎల్ల బంధువులఁ జల్లఁగాఁ బ్రోచితిని. వీరుల ధనవంతులుగాఁ జేసితిని. గొప్ప యజ్ఞముల నాచరించితిని. ఒక సమయమున నేనిఁ బరవారి నాశ్రయింపకుంటిని. మగఁటిమితోడ రాజరిక మొనర్చితిని. నాకుఁ గలిగెడిచావు రణరంగమున నగుటచే వీరస్వర్గము నందఁగలవాఁడను. కాబట్టి నా యాత్మకు శాంతి కలుగులాగున బ్రాహ్మణులకు దానాదులఁ గావింపుమనుము.

సంజయుఁ డాలాగుననే తెలిపెదనని వెడలెను. చేరువ పల్లెల నుండువారు కొందఱు సుయోధనుని గాంచ వచ్చిరి. వారికతఁ డచ్చటఁ జరిగిన యధర్మయుద్ధము వివరించెను. వారశ్వత్థామ కృపకృతవర్మలచ్చట సమీపముననే యుండుటెఱిఁగి వారియొద్ద కరిగి సుయోధనుని భంగపాటు దెల్పిరి. వెంటనే ఆ మువ్వురును సుయోధనుఁడు పడియుండు ప్రదేశమునకు వచ్చిరి. ధూళిధూసరిత గాత్రుఁడయి పడియుండు

నారాజరాజును గాంచి విషాదకులు లయిరి. అశ్వత్థామ ఆస్థితియందుండు సుయోధనుని వీక్షించి;

అక్కటా! ఎల్లప్పుడు రాజలోకములు చుట్టి కొలుచు చుండ సింహాసన మలంకరించుచుండు వాఁడవా నేఁడీలాగున నొంటరివై నేలఁబడియున్నావు? లక్ష్మి చంచల యగుట నిక్కము. ఇట్టి చపలచిత్తను నమ్మి యక్రమములకుఁ గడఁగిన పాండవులు కలకాలము మనియెదరు కాఁబోలు?"

"ఆచార్యపుత్రా! మనుజులకు సుఖదుఃఖములు పర్యాయముగ వచ్చుచుండుట సహజము. మహాత్ములట్టిదాని కెన్నఁడును వగవరు. సోదరులఁ, జుట్టముల, మిత్రుల జంపుకొని నేనొంటరినై బ్రదుకుటకంటెఁ జచ్చుట మేలుకదా?"

"మిత్రమా! 'బ్రతికియుండిన శుభములఁ బడయవచ్చు' నను వచన మెఱుఁగవా? జీవవంతుఁడవైనఁ గదా శాత్రవుల సంహరింపవచ్చును? ఆలాగున శత్రునాశము గావింపమి నిన్నును నిన్ననుసరించి మమ్మును దుఃఖసముద్రమున ముంచు చున్నది."

"చచ్చుటకుమున్న మిమ్ముఁ గనఁగల్గితి నదియే నాకుఁ బదివేలు."

"సుయోధనా! నీకిట్టి శాంతి యుదయించును గాక. నాక్రోధము సులభముగా నుపశమించునది గాదు. నాఁడు నాతండ్రిని జంపినపు డుదయించిన క్రోధాగ్ని మానసమున నే రగులుచుండెను. నేఁడు నిన్నీగతికిఁ దెచ్చుటచే నది జ్వలించి

చుట్టును వ్యాపించుచున్నది. ఇది యీ పాండవ కాననమును దహింపక యూరకుండజాలదు."

"సచ్చలీ! అభిమాన ధనుడనని వాసిగాంచిన నాకు మాత్రము శత్రు సంహారము అనిష్టమగునదా? తొడలు విరిగి నేలగూలి యీసన్న మరణసమయుడ నగుటచే ఏదియుం జేయలేక యూరకున్నాను."

"మిత్రమా! వినుము. నామాట లివి సత్యములని నమ్ముము. కృష్ణుడు చూచుచుండగనే పాంచాలాది బాంధవ వర్గముతో శత్రుసంహార మొనర్చెదను."

"గురుతనయా! నీవొనర్చబోవు శత్రుసంహార మేను జూచి యానందింపగలుగుదునో లేనో? నీవిపుడు నాకు సర్వసైన్యాధిపతివై ఇక నీ కార్యము నిర్వర్తింపుము."

అని యిటు సుయోధనుడు సర్వసైన్యాధిపత్యము నిచ్చినంతన యతని వీడ్కొని కృపకృతవర్మలతో నశ్వత్థామ యచటినుండి వెడలెను. క్రోధవశమున నశ్వత్థామ ఎచ్చట సాహసకార్యము లాచరించునో యని కృపాచార్యుడు సద్బోధ మొనర్చినగాని యవి యుపయోగ శూన్యము లయ్యెను. వారిని వీడి యశ్వత్థామ శత్రు హననమునకై యొంటరిగా వెడలెను. పరమశివుడు ప్రత్యక్షము గాగ దన్నాతని కుపహారముగా నర్పింపగడగెను. రుద్రుడనుగ్రహించి ఖడ్గ మొండొసగి; పాంచాలురకుం గాల మాసన్నమగుట దెల్పి వెడలిపోయెను. అశ్వత్థామ ఆ ఖడ్గమును బూని పాండవ శిబిరము జొచ్చెను.

అచ్చటి వారు నిశ్శేషముగా శత్రు నాశమగుటచే గాఢ నిద్రఁ జెందియుండిరి. ద్రోణపుత్త్రుఁడు నిద్రితుఁడగు ధృష్టద్యుమ్నునిఁ దన్ని లేపెను. లేచి నిలువఁ బడిన వానిఁ గ్రిందికిఁ ద్రోసెను. తన చరణమున వాని వక్షము నదిమిపట్టి మోమునఁ బిడికిటఁ బొడిచెను. కాలు సేతుల వానిఁ జదిపి చంపెను. ఉపపాండవులు దనపైకి రాఁగా వారిని సంహరించెను. శిఖండి యుద్ధమురాఁగ నాతనిజంపెను. తన్నెదిరింపవచ్చిన సైన్యమునెల్లఁ దునుమాడెను. పాండవులచ్చట లేమిని వారిని సంహరింప వీలుగామి కొంతయు వగచెను. అంతఁ గృపకృతవర్మలతోఁ గూడి సుయోధనుఁడు పడియుండు చోటికి వచ్చెను. తా వచ్చునంతదాఁక రాజరాజు మరణింపకుండుటకు సంతసించెను. సుయోధనునితోఁ దన విజయము సెప్పి యాతనికి మనస్తుష్టి గలిగించెను. కౌరవశ్రేష్ఠుఁ డనేకవిధముల నాతనిఁ బొగడెను. తన చావుకొఱకు వారల దుఃఖింపకుండ వలయున దనియు, నాలాగున వారు దుఃఖించినఁ దనయాత్మకు శాంతి గలుగనేరదనియుఁ జెప్పి సంతుష్టుఁడగుచు వీరస్వర్గ మలంకరించెను. గురుసుతుఁడు వీలయినంతవఱకు నింకను పాండవవధ గావింపఁ దీర్మానించుకొనెను, అవల ధర్మజుఁడు రాజ్యము నందెను గాని బంధునాశమునఁ గలిగిన దుఃఖముతో నెట్లో రాజ్యపాలనము సేయుచుండెను.

సమాప్తము.